# ఎల్లారెడ్డి సూక్తిముక్తావళి





రచయిత:

విద్వాన్: రాయరె, (తెలుగు పండితులు)

నల్లచెలిమిపల్లె 516 421. పులివెందుల తా॥, కడప జిల్లా.

ప్రథమ ముద్రణలు : 1995
భావమార్గశీర్ష శుద్ధ పౌర్ణమి
ప్రతులు : 1000

మూల్యము : రూ. **10-00**

ముద్రణ :
శ్రీ బాలాజి ప్రింటర్స్,
మెయిన్‌బజార్, పులివెందుల – 516 390.

## -: ముద్రారాక్షసము :-

| పేజి | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 19 | వాకి | వారికి |
| 4 | 21 | లెట్ణు | లెట్టు |
| 4 | 21 | జూదాలి | చూడాలి |
| 4 | 21 | మనును | మనసు |
| 5 | 25 | రాయలే | రాయరే |
| 7 | 37 | భాధ్యతో | బాధ్యతతో |
| 7 | 37 | రిలి | రీతి |
| 7 | 38 | దాని | కాకి |
| 8 | 49 | నప్పుడు | నడుపు |
| 9 | 51 | నప్పుటేది | నప్పుడేడి |
| 11 | 60 | బెనుక | వెనుక |
| 11 | 60 | ఓేస్తారు | చేస్తారు |
| 12 | 68 | పట్టె | పట్టి |
| 17 | 99 | రితి | రీతి |
| 19 | 107 | యందు | యందు |
| | 111 | ననను | నను |
| 20 | 116 | ప్రమోకు | ప్రమోగు |
| 25 | 145 | టన | నట |
| 28 | 161 | వాలి | వాల |
| 28 | 163 | లేవు | లేలేవు |
| 29 | 170 | కొరఅకె | కొఅకె |
| 32 | 285 | విధ్య | విద్య |
| 36 | 211 | — | చేయరు |
| 38 | 226 | యడల | యెడల |

| | | | |
|---|---|---|---|
| 41 | 242 | దైనాడు | దైనవాడు |
| 41 | 242 | మానర్ధ | పార్ధ |
| 42 | 250 | మోప | మోస |
| 43 | 252 | మేఘండు | మేఘుండు |
| 44 | 262 | రుబ్బు | వండు |
| 41 | 244 | కోటీస్వరుండు | కోటీశ్వరుండు |
| 50 | 293 | దాన | డాన |
| 52 | 308 | రన | రాన |
| 54 | 317 | కిరుకు | కరుకు |
| 55 | 323 | పెంజాడరు | పెండాడరు |

## -: ఆ ము ఖ ము :-

| పేజి | వక్త | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 9 | వచ్చునది | వచ్చినది |
| 5 | 6 | కనినని | కవినని |

ఇంకను దోషములు పాఠకులు గమనించి తెలిపిన తదుపరి ముద్రణమున సరిచేయగలము,



# —: ఆ ము ఖ ము :—

భారతీయులకు వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు ప్రమాణములు, భారతదేశ వాతావరణమున కనుకూలముగా ఆచార, ఆహార, విహారాదులు తెలుపునవి శాస్త్రములు, అందుచే శాస్త్రములు ప్రమాణములు. ముస్లిముల పాలనమున; ఆంగ్లేయుల పాలనమున మన ఆచార ఆహారాదులు మార్పు చెందినవి. పరపరిపాలనవలన శాస్త్రములు పోయి చట్టములు వచ్చినవి. ఆంగ్లేయుల పాలనలో శాస్త్రవిహిత ధర్మములుపోయి; వర్ణాశ్రమ ధర్మములు నశించి, చట్టము ప్రముఖ పాత్ర వహించినది. వారు పరదేశీయులుగాన బంధుప్రీతి ఆశ్రిత పక్షపాతములేక చట్టముతోనే క్రమశిక్షణను పాటించి పాలించుచుండిరి. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత శాస్త్రము చట్టము రెండు పోయినవి శాస్త్రము మీద నమ్మకము లేదు చట్టముమీద పట్టుదలలేదు. స్వాతంత్ర్యమును పరిపాలన పరముగ నన్వయించుకొనక! వ్యక్తి స్వేచ్ఛపరముగా నన్వయించుకొనిరి క్రమశిక్షణ లేక ఎవరి యిష్టము వచ్చినట్లు వారునడచుకొనుట ఎవరి పనిని వారు చేయకుండుట, యథేచ్ఛగా విహరించుటేగాక ఆహార విహార వాక్క్రియా స్వాతంత్ర్యలముతో దేశము వెనుకకు పోవుచున్నది ఆంగ్లేయులు వారి మతమును, అధికారమును, భాషను, మన దేశమున వ్యాపింపజేసిరి. అందుచే మన శాస్త్రములు భాషలు ఆచార వ్యవహారములు అడుగంటినవి. భారతీయ భాషలలో నీతి నియమములు దైవ! పాపభీతులను తెలుపు గ్రంథములు గలవు. ముఖ్యముగా సదాచారములు, సద్గుణములు అలవడు నీతి బోధకు సంబంధించిన సుభాషితములు; నీతి శతకములు; ఉపదేశములు కథలు కలవు. ఆంగ్ల భాషలో నీతి బోధించు గ్రంధములు లేవు కాన ఆంగ్ల విద్యార్థులకు భాషాబోధన తప్ప నీతి బోధనలేదు. ఇచ్చట

అప్రస్తుతమైనను నా బాల్యమున అభ్యసించిన నీతి గ్రంథములను గూర్చి ముచ్చటించవలసి వచ్చినది.

నేను పుట్టినది క్రీ.శ. 12-12-1932 శా.శ. 1833 అంగిరస మార్గశీర్ష శుద్ధ పౌర్ణమి కడప జిల్లా పులివెందుల తాలూకా నల్లచెరువుపల్లె గ్రామము తల్లిదండ్రులు చిన్నవీరారెడ్డి, చిన్నగంగమ్మ సాధారణ రైతు కుటుంబము. ఊరు వదలిపోయి చదువుకొనుటకు కూడా శక్తి చాలని ఆదాయము కల కుటుంబము. అందుచే స్వగ్రామమైన నల్లచెఱువుపల్లె యందే ప్రాథమిక విద్య పూర్తి చేసి పనిపాటలు నేర్చుకొనవలసి వచ్చనది. అట్టి సమయమున ఊరికి సమీపమున మోహనశైలమందుగల మోపూరు భైరవుని గుడి; అచ్చటి పరిసరములు; ప్రకృతి సౌందర్యము చూచి శ్రీ చిద్గగనానంద మహర్షులవారు అచ్చట ఆశ్రమమును నిర్మించి విద్యార్థులకు హిందీ నేర్పు యేర్పాటు చేసిరి. ప్రస్తుతము శ్రీ చిద్గగనానందస్వాముల వారు నిర్మించిన ఆశ్రమము కొండపైనున్నది శిథిలమైనది. క్రిందనున్న ఆశ్రమము, పాఠశాలకూడ పడిపోయినది ఆ ప్రాంత ప్రజలు వానిని పాడుచేయుచున్నారు. దాదాపు మూడు సంవత్సరములు అచ్చటనే ఉండి భక్తులకు బోధ చేయుచు భాగవతము, భారతము, భగవద్గీత పురాణములు చెప్పుచుండిరి. ముఖ్యముగా భాగవతములోని ప్రహ్లాద చరిత్ర; రుక్మిణీ కళ్యాణము, గజేంద్ర మోక్షము మొదలగు ఘట్టములను చెప్పుచు ముఖ్యమైన పద్యలను మాచే కంఠస్థము చేయించిరి అప్పటి నుండియే మాకు మంచి నడవడికలు వచ్చినవి. తరుపరి 1945వ సం॥ శ్రీవారి శిష్యులగు అభయానందస్వామి మమ్ము శ్రీ మళయాళస్వాముల వారి ఆశ్రమమైన వ్యాసాశ్రమమున చేర్చిరి. అచ్చటకూడ సంస్కృత భాషాభ్యసనము చేయుచు; హితోపదేశము; పంచతంత్రము; సుభాషిత త్రిశతి (భర్తృహరి వ్రాసినది) పంచకావ్యములు నాటకములు పాఠ్య పుస్తకములుగా నున్నందున అందలి నీతి బోధక శ్లోక

ముల కంఠస్థముచేయుటచే నీతి గ్రంథములపై ప్రీతి యేర్పడినది. సుభాషితములలో సూక్తులలో చెప్పిన ఆచారములు అలవడినవి. అంతేగాక నిరాడంబరుడు, నిస్వార్థపరుడు, సదాచారసంపన్నుడు, కులపతియు నగు శ్రీ మణియాళస్వాములవారి అంతేవాసినై; వారిచ్చు ఉపన్యాసములు వినుట వ్రాయుట వారికి వచ్చు జాబులు చదివి జవాబు వ్రాయుట నాకు నియమించిన పని. ఋషుల ఆశ్రమములలో విద్యాభ్యాస మొనర్చుటచే కొన్ని మంచి అలవాట్లు కలిగినవి. సప్తవ్యసనములకు లోనుగాక బుద్ధుని పంచ శీలముల పాటించుట అలవడినది. దాని ఫలితమే ఈ సూక్తి ముక్తావలి రచనకు కారణము నేను భర్తృహరివలె రాజునుగాను, వేమనవలె రాజు తమ్మునిగాను, వారివలే సకలైశ్వర్యములను అనుభవించినవాడినిగాదు. భర్తృహరినిగూర్చిన గాథవలె నేను విరక్తుడనుగాను, వేమనవలె భోగినై యోగిని కాలేదు. భర్తృహరి విరక్తుడగుటకు ఒక గాథ కలదు. భర్తృహరి రాజ్యపాలన చేయుచుండగా ఒక బ్రాహ్మణుడు అమరత్వమును యౌవనమును ప్రసాదించు నొక ఫలమును రాజునకిప్వగా, దాని నతడు తన పత్ని కొసగెననియు, ఆమె తన కిష్టుడైన అశ్వపోషకున కిచ్చెననియు, అతను తన కిష్టురాలైన పుష్పలావికకు యిచ్చెననియు, ఆమె తనును అభిమానించి వర్ణించు కవికిచ్చెననియు, అతడును తన కవితను అభిమానించు నర్తకికి యిచ్చెననియు, ఆమె చివరకు ప్రజారంజకముగా పాలించు ప్రభువగు భర్తృహరికి యివ్వగా రాజు దాని వృత్తాంతమంతయు నెరింగి;

" యాంచింత యామి మనసా మయిసా విరక్తా
సాప్యన్యమిచ్ఛ తిజనో సజనోన్య సక్తః ।
అస్మత్కృతేచ పరితుష్యతికా చిదన్యా
ధిక్తాంచ తంచ మదనంచ ఇమాంచమాంచ॥" అను

శ్లోకమును వ్రాసెనట "అనగా నేను ప్రేమించిన పత్ని మఱియొకని

అతడు మఱియొకదాని, ఆమె మఱియొకని, వాడు మఱియొకదాని, ఆమె మఱల నన్ను ప్రేమించిరి. ఇందులకు కారణభూతములైన నేను నా భార్య దాని ప్రియుడు, వాని ప్రియురాలు దీనికంతకు కారకుడైన మన్మధుడు అందరము నిందింపదగిన వారమే" అను భావము గల ఈ శ్లోకమును వ్రాసి విరక్తుడై రాజ్యమును తమ్ముడగు విక్రమార్కుల వారికిచ్చి విరాగియై చని తపస్సు చేసి, జ్ఞానియై సంస్కృతమున సుభాషిత త్రిశతియను గ్రంధమును రచించెను అట్లే యోగి వేమన కూడ అన్ని సుఖముల ననుభవించి వేశ్యాలోలుడై రాగి, భోగి, యోగియై వేమన శతకమును రచించెను, ముందు చెప్పినట్లు నేను ఋషుల సన్నిధిలో సంస్కృతాభ్యాసము చేసి మా ఉపాధ్యాయులైన రఘునాధ తాతాచార్యులు, కృష్ణమాచార్యులు. గోపాలాచార్యులు మొదలగువారు నాచే కంఠస్థము చేయించిన నీతి పద్యముల వలననే ఈ సూక్తిముక్తావలి వ్రాయ గలిగితిని. సంస్కృతాంధ్ర హిందీ భాషలలోని నీతి గ్రంధములను చదివి. ఉపాధ్యాయుడనుగా, రైతుగా పల్లెటూరు జీవితానుభవము వలన కలిగిన జ్ఞానముతోను సాంఘిక రాజకీయ, వైదిక గ్రంధముల పరిశీలనము వలనను సంఘములోని అవినీతి అక్రమములను బాగుగా నెరింగివాని తొలగించుటకు చేసిన ప్రయత్నమే ఇది. దురాచారములను దుర్నీతిని చూపి నాటకములను గేయములను కొన్నింటిని వ్రావితిని. ముఖ్యముగా నేను చిన్నతనమున నేర్చుకున్న మంచి గుణములకు కారణము నీతి గ్రంధములు చిన్న తనములోనే చిన్న తరగతులలోనే కంఠస్థము చేయించిన నీతి పద్యములుగాన, అట్టివే కొన్ని వ్రాసి చిన్నపిల్లలకు బోధించినచో మంచి అభ్యాసములు వచ్చుననియు, అవి మార్పు జెందవనియు తలంచి పిల్లలకు అర్థమగు భాషలలో రచించితిని. నా ఉద్దేశము సిద్ధించినచో నేను ధన్యుడను. కవిత వ్రాసి ఇతరులను పొగడుటకు దానితో జీవించుటకు, పుస్తకములను ముద్రించి అమ్ముకొని ప్రచారము చేసి కొనుటకు నేను పూనుకొనలేదు. తీరిక వేలలలో ఆవేదన ఆవేశము

వచ్చినపుడు ఛందస్సునుగూడ పట్టించుకొనక గేయములను వ్రాసి పడవేయుచుంటిని, అవియన్నియు 60వ యేట ఉపాధ్యాయ వృత్తి నుండి విశ్రాంతి తీసుకున్న తరువాత ముద్రించి కొందరికందజేసితిని "ఎల్లారెడ్డి గాయాలు" బిల్హణీయము ముద్రించితిని, నేనింత వఱకు అజ్ఞాత వాసము చేసితిని. వ్రాసిన పుస్తకములను, "రాయరె" అను పేరుతోనే ప్రకటించితిని. అందుచే నేను కవిననిగాని కవిత్వము వ్రాయగలనని గాని కనీసము మా ఊరివారికిగూడ తెలియదు.

శ్లో॥ కుసుమస్తబకస్యేవద్వయీ వృత్తిర్మనస్వినః।
మూర్ధ్నివా సర్వలోకస్య శీర్యతేవన ఏవవా॥

అనగా పూలగుత్తివలె గొప్పవారు అందరిచేత గౌరవింపబడి, మన్ననలు పొందెదరు. లేదా! ఉన్నచోటనే మారుమూల ఎవరికి తెలియక తమ ధర్మమును నిర్వహించి నశించెదరు. ఒక చెట్టు పూల లో కొన్ని శివుని శిరమును చేరును, కొన్నిమాలలై మహానాయకుని మెడలో పడును. మఱికొన్ని వేశ్య కొప్పులో అలంకరింపబడును మఱి కొన్ని ధనవంతుల పరుపులపైన కాళ్లక్రిందపడి నలిగిపోవును. మిగిలినవి తమ సౌందర్యమును సౌరభమును పుష్పొడిని ప్రకృతిలో లీనము చేసి వాతావరణ కాలుష్యమును తొలగించి తల్లి వడిలోనే వాడి వత్తులై నేల పడిపోవును. ముందు చెప్పినపూలు వాతావరణ కాలుష్యములో పడిపోగా, తల్లి దగ్గఱ పడిన పూలు వాతావరణ కాలుష్యమునకు లోనుగాక పవిత్రముగ ఉండును. ఐతే ఆ చెట్టు తనకు పూచిన పూవులన్నిటికి రూపము, అందము, సౌరభము, సమానగా యిచ్చి సమానంగా పోషించినదిగాన దేనిని అగౌరంగా చూడక సమానంగానే చూచును. అట్లే దైవదృష్టిలో మానవులందరు సమానులే. కొందరు గౌరవింపబడిన కొందరు అగౌరవము పాలై బాధపడనవసరంలేదు. గొప్పవారు తమగొప్ప తనమును చాటుకొనక

తమ ధర్మమును నిర్వహింతురు, నిరాడంబరముగ జీవింతురు. ఉప్పుబోటుకూడ తెలియక దేశ, ప్రజాహితము కోరుచు జీవింతురు, అట్టివారి ఘనతవలనే నేటికిని మన దేశం అగ్రగామిగా నున్నది. సదాశయములను కొన్నింటిని కవితా రూపమున వెలువరించితిని. కొన్ని సఫలత హొందినవి, అట్లే ఈ సూక్తిముక్తావలి కూడ కొందఱకు ఉపయోగపడినచో నేను ధన్యుడనుగా తలంతును. నా పేరు రామిరెడ్డి యల్లారెడ్డి ఐనను 'రాయరె' అను పేరుతో రచనలను ప్రకటించితిని.

ఇచ్చట ఒక పద్యమునుగూడ వ్రాయవలసి వచ్చినది ఎందు కనగా? విమర్శకులు కొన్ని అర్థములేనివి పనికిరానివికూడ వ్రాయు చుందురు. తరువాత కాలమువారు తలలు పగులగొట్టుకొనకుండుటకై వ్రాయవలసి వచ్చినదిగాని పొగడుకొనుటకుగాదు.

సంస్కృతాంధ్రాంగ్లహిందీ విశారదుండు
చతురవాక్చతురానన సరసమూర్తి
రామిరెడ్డి యల్లారెడ్డి నామమైన
"రాయరే యను పేరుతో రచన చేసె"

సంస్కృత శ్లోకములకు కొన్నింటికి అనువాదము చేసితినని చెప్పితిని అవన్నియు ఉదహరించినచో గ్రంథము విస్తారమగునను భీతితో ఉదహరించలేదు హితోపదేశము, పంచ తంత్రము, సుభాషితాలు లోకోక్తులుగల కొన్ని గ్రంథముల నుండి నేను నేర్చిన నీతిని వ్రాసితిని. కొన్ని ఆదునిక కాలములో సినిమాలు, ఎన్నికలు, అసమానతలు, కలహములు, పరిపాలన లోపములు, వేష భాషలు, నాకు అసహ్యముగ తోచినవి కూడ తెలిపితిని. నేను ఎవరిని దృష్టిలో పెట్టుకొనిగాని, ఎవరిని నిందింపవలెననిగాని

చేసినపనికాదు. అందుచే దయయుంచి ఎవరుకూడ తమకు అన్వయిం చుకొనకసామాన్యముగా వ్రాసినట్లు తలంచవలెనని ప్రార్థించుచున్నాను మునుపు ప్రచురించిన పుస్తకములలో సంస్కృత పదములు ఎక్కువగా పడినవి. అట్లుగాక సామాన్యమైన వారికిగూడ అర్థమగునట్లు చిన్న చిన్న తెలుగు పదములను వాడితిని. కొందరు విమర్శకులు శైలిని బట్టి ఇది ఆకవిదికాదు ఈ కవిదిగాదు అని వ్రాయుచున్నారు. అట్లు నా కవితను పోల్చుటకు వీలుపడదు నేను ఎక్కువగా గేయ కవితను వ్రాసితిని, ఈపద్య కవిత నాదికాదనికూడ కొందరు తలంచవచ్చును. కవికాలమును నివాసమును నిర్ణయించునపుడుకూడ ఏవో ఊహలు చేయుచుందురు. అట్టివానికి చోటులేకుండుటకై నా జన్మ తిథిని వ్రాసిన గ్రంథములను. నివాసమును ప్రకటించితిని, ఈ నీతి పద్య ములను పాఠ్యభాగములందు చేర్చి విద్యార్థులకు బోధింపవలెనని విద్యాశాఖాధికారులను, పాఠ్యగ్రంథకర్తలను కోరుచున్నాను.

మునుపు ప్రకటించిన యల్లారెడ్డి గాయములలో ఆకాలమున ఉపాధ్యాయునకుగల జీతబత్తెములు ఆదరణ సాధారణ ఉద్యోగి పొందు బాధను వర్ణించితిని, నా ఆవేదనను ప్రకటించి వారికి తగిన సౌకర్యములు కావలెనని కోరితిని అవి కొన్ని నెరవేరినవి కాని యిప్పుడు ఉపాధ్యాయులకు ఉద్యోగులకు సౌకర్యములు కలిగినను వారు తమ విధిని నిర్వహించుటలేదు. అందుచే యిప్పుడు వారినికూడ నిందింపవలసి వచ్చినది, నా పుస్తకములలోనే ఒక్క చోట ఒక విధముగ మరియొకచోట మరియొక విధముగ వ్రాయుట స్వవచో వ్యాఘాతముగాదా? అని మీరు తలంపవచ్చును, ఏకాలములోనుండు లోపములను ఆకాలములో చెప్పుట జరిగినది. ఇకముందు ఇప్పుడు చూపిన దోషములు కొన్ని తొలగవచ్చును. అప్పటివియన్నియు అప్రస్తుతములుగా తోచవచ్చును, కొన్ని నిత్య సత్యములుకూడ కావచ్చును.

నేను చదువుకొను దినములలోనే కొన్ని ఉద్యమములు, స్వాతంత్ర్యోద్యమము, ఆంధ్రరాష్ట్రోద్యమము జరిగినపుడు వాటిని గూర్చి గేయములు, నాటకములు వ్రాసి ప్రదర్శించితిని. పొట్టి శ్రీరాములు దీక్ష బూనినపుడు చనిపోయినపుడు రాజకీయ నాయకులతోపాటు ఉపన్యాసములలో పాల్గొని బుర్రకథలు గేయములు వ్రాసి ప్రచారము చేసితిని, అట్టివన్నియు అంతటితోనే ఆగిపోయినవి. ఉపాధ్యాయవృత్తి చేయునపుడు వృత్తికి న్యాయము చేయుచు తీరిక వేళలయందు వ్యవసాయము చేయుచుంటిని అందుచే కవితావ్యాసంగ ముండినను ప్రచారము చేసికొనుట వ్రాసినవి అచ్చు వేయించుట చేయలేదు. అందుచే నా రచనలు మూలపడినవి. 1950 సంవత్సరమున కఱవు వచ్చినపుడు "కఱవు" అను నాటకము వ్రాసి స్వయముగా ప్రదర్శించితిమి, దానినికూడ అచ్చు వేయించలేదు. రాయలసీమ పరిస్థితి నాడెట్లున్నదో నేడుకూడ అట్లే ఉన్నది నీటి సమస్య తీరలేదు. అభివృద్ధికూడ అంతంత మాత్రమే ఉన్నది. అందుచే నా ఆవేదనను కవితారూపకముగా చాటితిని. రాజకీయములలో దిగి ప్రచారము చేయలేదు, నేను తెలిపిన చెడు తొలగిమేలు కూరగలదని ఆశించుచు అందులకు భగవానుని యనుగ్రహమును కోరుచున్నాను. మన ప్రాచీన అచార, ఆహార విహార, నియమములను నేటి నాగరికులు దోషములుగా తలంచుచున్నారు, సుదీర్ఘముగా ఆలోచించి తరచిచూచినచో అట్టి నాగరికత, సంస్కృతి నశించుచున్నందులకు బాధ కలుగును. వర్ణాశ్రమ ధర్మములు సంఘ జీవితమునకు పరస్పర సహకారమునకు పనికివచ్చుటకై పెద్దలు యేర్పరచిరి "జాతిర్వర్ణం మయా సృష్టం గుణ కర్మ విభాగశః" అని గీతలో కలదు కదా? వర్ణాశ్రమ ధర్మములు నశించి, జాతి; మత, కుల భేదములు ప్రబలినవి, అందుచే సనాతన ధర్మము, భారతీయ సంస్కృతి నశించినది, వర్ణాశ్రమ భేదములులేని మహమ్మదీయ, క్రైస్తవ మతములు ప్రబలు

చున్నవి, మరల మత విద్వేషములు, జాతి భేదములు, వర్ణభేదములు పెచ్చు పెరుగుచున్నవి. వీటిని గూర్చిన ఖండన మండనములు అన్ని మత ప్రవక్తలు మత గ్రంథములు చాటుచున్నవి. బుద్ధుడు, గాంధి, వీరబ్రంహం చాటిన సిద్ధాంతములు మనకు తెలిసినవే, అట్టివే కొన్ని సూక్తులను నేను వ్రాసితిని, నాకు వర్ణాశ్రమ ధర్మములపైన జాతి మత భేదములపైన, దేశ, భాషా, ప్రాంతీయ, భేదములపైన, స్త్రీ పురుష భేదములపైన మానవ, జంతు, పశు, పక్షి, క్రిమి కీట కాదులపైన, దైవారాధన పద్ధతులపైన నెట్టి ద్వేషభావములేదు. సర్వలోక, సర్వమానవ, సర్వప్రాణి సమభావము ప్రజలలో గలుగ వలెనను కోరికతో కొన్ని దోషములను తెసిపితిని. గుణదోషములు కూడ కాలానుగుణముగా మారుచుంచును. అన్ని సర్వకాలములకు సరిపడవు. కాన సరిపడువానిని మాత్రమే స్వీకరింపకోరెద. వైద్య విధానములలోకూడ చాలా భేదములు గలవు. కొన్ని వైద్యవిధానములు వ్యాధులు వచ్చిన తరువాత తొలగించు పద్ధతులను తెలుపును ఉదాహరణకు అలోపతి (ఆంగ్ల) వైద్యము కొన్ని వైద్యవిధానములు వ్యాధి రాకముందు తీసుకొనవలసిన జాగ్రత్తలనుకూడ ముందే తెలుపును (ఆయుర్వేద వైద్యము) స్నాన, సంధ్య జప, తప, ఉపవాస, పూజ, పునస్కారములుకూడ ఆరోగ్య సూత్రముల పాటించునవియే అవన్నియు మతగ్రంథములలో నున్నవికదా? కాన వేనినికూడ తప్పుగా తలచక, దేశ, కాల. ములకు అనువగువానిని పాటించుట మంచిది. ఎన్నిరకములైన భేదములున్నను సమైక్య భావముగలిగి, దేశ, కాల, వేష, మతాతీత భావముతో మెలగుచు, మాతృదేశ, భాష, వేష మతాభిమానములు వదలకున్నను పరస్పరాదదాభిమానములు గలిగి సమైక్య భావము కలిగియుండవలెను సంఘములో అవినీతి, అక్రమము, స్వార్థము నశించవలెను. ప్రతిమానవుడు స్వధర్మమును సక్రమముగా నిర్వహింపవలెను. అప్పుడే మన దేశము పూర్వవైభవ

మును సంతరించుకొని సర్వదేశములకు ఆదర్శవంతమై పురోగమిం పగలదు అందులకై ప్రతి ఒకరు పాటుపడవలెను. కర్షకులు, కార్మి కులు, శ్రామికులు ఉద్యోగులు, సైనికులు, నాయకులు, గాయకులు నటకులు ఎల్లరు సమైక్య భావముతో మెలగవలెను.

" ఆర్ష సంప్రదాయ మంతరించెనునేడు
ఆంగ్ల సాంప్రదాయ మవతరించె
సంస్కృతంబుపోయె సంస్కృతిపాడాయె
స్వేచ్ఛమిగుల ప్రబలె చెడెనునీతి॥ "

కాన మరల మన సంస్కృతిని పునరుజ్జీవింప చేయవనెనన్న వేద ములు ఉపనిషత్తులు, పురాణములు, భారత, భాగవత, రామాయణ ములలోని నీతిని సరసమైన భాషలో అందరకు అర్థమగు రీతిగా వ్రాయవలెను. అందలి కథలు ఆఖ్యానములు, తెలుపు నీతిని బోధిం పవలెను. సమైక్యత, సహనము, సదాచారము, సద్భావము, సమా నత్వమును బోధించు గద్య పద్య గేయముల రచన గావించుటకే కవులు పండితులు పూనుకొనవలెను. వాటి ప్రచారమునకు కళాకారులు నటకులు గాయకులు నడుము బిగించవలెను



ఇట్లు విద్వాన్ :
**రాయురె,**
తెలుగు పండిట్,
నల్లచెఱువుపల్లె P.O.
(Via.) అగడూరు.
పులివెందుల తా॥.
కడప జిల్లా.

విఘ్నేశ్వరాయనమః నమః శారదాయై

# —: ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి :—

నమో వెంకటేశ్వరాయ. నమోస్తు భైరవేశ్వరాయ.

విఘ్ననాథుగొల్చి విశ్వేశుపూజించి
శారదాంబనటులె సన్నుతించి
వెంకటేశ్వరునకు వేమారుమ్రొక్కుచు
రాయరే రచించె రమ్యనీతి 1

విష్ణుకృష్ణురాము వేనోళ్లకీర్తించి
సర్వదేవతలను సంస్తుతించి
భైరవేశ్వరునకు భక్తితో ప్రణమిల్లి
రాయరే రచించె రమ్యరీతి 2

తన్నుగన్నతల్లి దండ్రుల దలపోసి
తానుపుట్టినట్టి తలముదలచి
ఆప్తబంధుమిత్రులందర చింతించి
రాయరే రచించె రమ్యభాష 3

చదువుచెప్పినట్టి సద్గురువరులకు
చదువుకొన్నయట్టి సంస్థలకును
చేతులెత్తిమ్రొక్కి చేతనైనట్టుల
రాయరే రచించె రమ్యలీల 4

వ్యాసభాసు కాళిదాసు వాల్మీకుల
బాణదండి మాఘుభారవులను
భర్తృహరిని హర్షుభవభూతి శ్రీహర్షు
సంస్కృతాది కవుల సంస్మరించి 5

నన్నయాదిగాగ చిన్నయవఱకున్న
అష్టదిగ్గజాల నాంధ్రకవుల
పూర్వకవులనెల్ల పొగడుచు పలుమారు
ఎల్లరెడ్డిమొక్కె ఎల్లరకును 6

నాటినేటిమేటిసాటి నాయకులను
ఆధునికులనెల్ల నాదరించి
ఎట్టివారినైన ఎగతాళిచేయక
రాయరే రచించె రమ్యరీతి 7

చదువుకొన్నవారు చదువుచెప్పెవారు
చదువుకొనెడివారు చక్కగాను
చదివివినియు దీనినాదరించేవారి
హస్తపద్మములకు అంకితంబు 8

ఎవ్వరేమితిట్ట నెవ్వరినేమన
పొగడతెగడనన్ను పొంగకృంగ
ఉన్నరీతి చెప్పుచున్నాను ఎవరేమి
బాధపడక బాగుపడగదలచి 9

మంచితీసికొంచు మనసులోనుంచిన
మాన్యులెల్ల మంచిమనుజులైరి
చెడ్డతీసుకొన్న చెడిపోవుచున్నారు
ఎల్లరెడ్డిమాట కల్లగాదు

విద్వాన్ : **రాయరె,**
భావ ఆశ్వీజ విజయదశమి,
14–10–94,

ఓమ్ -: శ్రీ :- ఓమ్

# ...: ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి :...

సంపదున్నవేల సన్నిధిజేరుచు
ఆపదున్నవేల నావలుండు
బంధువెపుడు మంచిబంధువుకాదయా
రాయరేవచించు రమ్యరీతి 1

బాగుపడినవాని ప్రస్తుతిజేయుచు
చెడినవారినెల్ల చీదరించి
ఆదరించువారె ఆప్తులు మిత్రులు
రాయరేవచించు రమ్యరీతి 2

కష్టకాలమందు కన్నీరుగార్చును
మంచికాలమందు మించినడచు
చేతగానివాడు చేయునీరీతిగా
రాయరేవచించు రమ్యరీతి 3

పరులబాగుచూచి పరమసంతసమందు
పరులకీడుచూచి పరితపించు
సజ్జనుండు గొప్పసంస్కారయుతుడైన
రాయరేవచించు రమ్యరీతి 4

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

తానుచేయుతప్పు తనలోనతలపక
పరులతప్పులెన్ను పామరుండు
గొప్పచెప్పుతనకు గోరంతఒప్పున్న
రాయరేవవించు రమ్యరీతి 5

వానివీడుతిట్టు వీనివాడునుతిట్టు
తిట్టుకొనుటలోనె దిట్టలైరి
ఎవరితప్పువారు ఏనాటికెరుగరు
రాయరేవవించు రమ్యరీతి 6

ఓట్లనడుగునప్పు డొకరికంటెనొకరు
చెవులుతూట్లుపడగ చెప్పువారె
ఓట్లుకొల్లకొట్టి ఒక్కరుపలుకరు
రాయరేవవించు రమ్యరీతి 7

కఱవుకాటకాలు వరుసగావచ్చినా
రైతుకేమిచేయ రైరియెవరు
వట్టిమాటలాడి ఓట్లుగైకొనువారె
రాయరేవవించు రమ్యరీతి 8

పాఠశాలలందు పంతుళ్లెకరువైరి
చదుకొనుడటంచు చాటువారే
అక్షరాలులొచ్చు అర్భాటమేహెచ్చు
రాయరేవవించు రమ్యరీతి 9

త్రాగరాదటంచు తండోరవేతురు
మద్యమమ్ముకొనగ మాన్యమిచ్చి
చూడబోద్యమగును రేడియోచాటింపు
రాయరేవవించు రమ్యరీతి 10

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావల

ఏదిమంచి, చెడ్డయేదియోయెఱుగక
తనకుతోచినట్లు తానుచేయు
అవియెపరులుచేయ నపరాధమందురు
రాయరేవచించు రమ్యరీతి 11

ఆడవారిబ్రతుకు లధ్వాన్నమైపోయె
ఆపదందువారి నాదుకొనరు
ఆలుమగలకైన నంతరంచేయుండు
రాయరేవచించు రమ్యరీతి 12

ఇంటిలోనిపోరు కంటిలోకారము
కడుపులోనిపుండు కాలిఆణె
బాధకలుగజేయు భగవంతునకునైన
రాయరేవచించు రమ్యరీతి 13

త్రాగుపోతువాడు తానుచెడుటగాక
ఆలుబిడ్డలకును హానిచేయు
పుట్టినపుడెవాడు గిట్టినమేలుండు
రాయరేవచించు రమ్యరీతి 14

అక్రమార్జితంబు అన్యాయముగపోవు
సక్రమార్జితంబు చక్కగుండు
కష్టపడకకలుగు కలిమికివిలువేది
రాయరేవచించు రమ్యరీతి 15

ధర్మకార్యమునకు దానంబుచేసిన
ఫలితమందగకును గలుగుచుండు
చెడ్డపనులకీయ చెడిపోదురందరు
రాయరేవచించు రమ్యరీతి 16

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

పరులనేడిపించి బ్రతుకువాడెవ్వడు
బాగుపడడు పరులబాధపెట్టి
ప్రజలనిందతోడ పతితుడై పోవును
రాయరేవచించు రమ్యరీతి 17

కొడుకుపుట్టగానె గొప్పగాదెప్పుడు
కూతురైననేమి కొఱతకాదు
ఎంశకీర్తినిలుపువారె పోమిన్నలు
రాయరేవచించు రమ్యరీతి 18

కాకినోరు గొట్టిగద్దకేసినయట్లు
పేదవానిదోచిపెట్టనేల
ఉన్నవారిదోచి లేనివాకిపెట్టు
రాయరేవచించు రమ్యరీతి 19

కాకినోరుగొట్టి గద్దకువేయుట
ఘనతకాదుగాని ఘనులెయైన
గద్దనోరుగొట్టి కాకికివేయండి
రాయరేవచించు రమ్యరీతి 20

అమ్మనాన్నలెట్టు లల్లారుముద్దుగ
చంటిపాపలపుడు చాకినారొ
తల్లిదండ్రినటులె తనుజులుజూడాలి
రాయరేవచించు రమ్యరీతి 21

ముక్కుమొగముకండ్లు చక్కగానుండిన
అందమున్నదంచు ననగరాదు
మనసుమంచిదైన మనుజులకందము
రాయరేవచించు రమ్యరీతి 22

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

ప్రజలసొత్తు వినుచు బడికిరాకుండిన
పంతులెల్ల నాడుబంతులైరి
పంతులెల్ల పూలబంతులుకావలె
రాయరేవవించు రమ్యరీతి 23

జీతమెక్కువున్న జీవించగాలేర?
లంచమడిగి ప్రజలముంచనేల
పరమలోభులగుచు పనులనుజేయరు
రాయరేవవించు రమ్యరీతి 24

మంచిగుణములున్న మనుజుడెవ్వండును
పైకిరాడువాని బ్రతకనీరు
పెద్దవాడెయిపుడు దొడ్డవాడై పోవు
రాయలేవవించు రమ్యరీతి 25

తెలుగుభాషపేర తెలుగుదేశమువచ్చె
తెలుగుభాషకేమొ తెగులువచ్చె
పేరుజెప్పిబ్రతుకు పెద్దోల్లుమనవాల్లు
రాయరేవవించు రమ్యరీతి 26

తెలుగుసవ్రాయనేర్చు తెలుగువారందరు
తెలుగుదేశమేలు దిట్టలైరి
తెలుగుపండితులకు తిరిపెమేగతియాయె
రాయరేవవించు రమ్యరీతి 27

తెలుగుదేశమొచ్చి నలుబదేండ్లైనను
తెలుగువారికలలు కల్లలాయె
తెలుగుభాషలోన దేశపాలనలేదు
రాయరేవవించు రమ్యరీతి 28

పదులయేండ్లుజదివి పండితుడైనను
పాఠశాలకైన పనికిరాడు
అంగ్లమొచ్చినోడె అధికారి;ఉద్యోగి
రాయరేవబించు రమ్యరీతి 29

ప్రజలుతెలుగువారె ప్రభువులుతెలుగోళ్లె
దేశమన్నతెలుగె తెలుగులోన
ఓనమాలురావు తెలుగుపిల్లలకైన
రాయరేవబించు రమ్యరీతి 30

డబ్బులున్నవానిజబ్బు పత్రికకెక్కు
రాజ్యమేలువాని భోజ్యమెక్కు
పేదవాడుచచ్చి పీనుగైయెక్కడు
రాయరేవబించు రమ్యరీతి 31

ధనముప్రోగుచేసి ధర్మంబుచేయక
తానుతినకనున్న హీనుడవని
ఊరుపేరులేక నూరకచచ్చును
రాయరేవబించు రమ్యరీతి 32

అప్పులిచ్చువారు గొప్పగాదెప్పుడు
అప్పుతీర్చువారె గొప్పవారు
తీర్చనోనికిచ్చి తిప్పలుపడరాదు
రాయరేవబించు రమ్యరీతి 33

ఆపమన్నవాని యాపదతొలగించు
భయముగల్గువాని భయముపాపు
సజ్జనుండుచేయు సత్కార్యమిట్టిదె
రాయరేవబించు రమ్యరీతి 34

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

స్త్రీలతోడనెపుడు వెర్లాటమాడకు
స్త్రీలునొచ్చుకొన్న చేటుగల్గు
స్త్రీలుమెచ్చిరేని సిరికూడివచ్చును
రాయరేవచించు రమ్యరీతి 35

ఆడవారినూరక వమానపరచకు
ఆడవారె తోడునీడనీకు
అవ్వఅమ్మఅత్త ఆలివారేకదా:
రాయరేవచించు రమ్యరీతి 36

భర్తభార్యనెంత భాద్యతోజూచు
భార్యభర్తకంత భక్తిజూపు
స్త్రీలుపురుషులిట్లు చెలిమితోమెలగాలి
రాయరేవచించు రమ్యరితి 37

కాకిగూటిలోన కోకిలపెరిగిన
కూతదానికూత కూయకుండు
సహజగుణమువచ్చు సహవాసమేదైన
రాయరేవచించు రమ్యరీతి 38

వానవచ్చునంచు ప్రాణంబుపోవంచు
అందరెరిగినట్టి యంశమైన
ఎప్పుడేదిజరిగు టెవ్వరెరుంగరు
రాయరేవచించు రమ్యరీతి 39

వీధిలోనికేగి విసిగివచ్చినభర్త
నింటిలోనిభార్య యీసడించి
మనసువిరుగునట్లు మాటాడగారాదు
రాయరేవచించు రమ్యరీతి 40

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

ఆకలైనవాని కన్నము పెట్టుము
దప్పిగొన్నవాని దప్పితీర్చు
దానికంటెమించు ధర్మంబులేదిల
రాయరేవచించు రమ్యరీతి 41

అర్థికోరినప్పు డర్థంబునొసగుము
విద్యకోరినప్పుడు విద్యచెప్పు
శోకమున్నవాని శోకంబుబాపుము
రాయరేవచించు రమ్యరీతి 42

తెచ్చిపెట్టుచున్న మెచ్చుచుందురునిన్ను
తెచ్చిపెట్టకున్న తిట్టుచుంద్రు
లాభమున్నయెడల లాలనజేతురు
రాయరేవచించు రమ్యరీతి 43

కోపమధికముండ కూడదుదేహికి
కోపమెక్కువున్న తాపమగును
తాపమధికమైన తనువునుగాల్చును
రాయరేవచించు రమ్యరీతి 44

పసితనంబులోన పాండిత్యమబ్బదు
ముసలితనములోన ముద్దురాదు
పచ్చికాయగోయ పండెట్టులగునన్న
రాయరేవచించు రమ్యరీతి 45

పండ్లుకండ్లుచెవులు తుండ్లుపాడైనను
కాల్లుచేతులైన కదలకున్న
ప్రాణమన్నతీపి పాపిష్టిదేహికి
రాయరేవచించు రమ్య రీతి 46

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

కూలినాలిచేసికొను చుండువాడైన
రాజ్యమేలువాడు, రైతుకూడ
పొట్టకూటికొఱకు పోరాడుటేకదా
రాయరేవచించు రమ్య రీతి 47

కులముగాదుమిన్న గుణముప్రధానము
వృత్తియేదియైన వెలితిరాదు
చేతనైనపనిని చేయుముశ్రద్ధగా
రాయరేవచించు రమ్యరీతి 48

గొప్పవాడుతాను గొప్పనిచెప్పడు
పరులుచెప్పుచున్న నొప్పుకొనడు
నేనేగొప్పయంచు నీచుండువాగును
రాయరేవచించు రమ్యరీతి 49

గొప్పవానిగుణము లొప్పబోడల్పుండు
లేనిపోనినింద లేయుచుండు
ఒప్పులెన్నియున్న తప్పులుగామాచు
రాయరేవచించు రమ్యరీతి 50

ముప్పువచ్చునంచు ముందుగాతెలిసిన
తెలివిలేనివాడు మేలుకొనడు
పరులుచెప్పునపుడు పాటించుకొనకుండు
రాయరేవచించు రమ్య రీతి 51

వచ్చునప్పుడేది తెచ్చుకోకుండిన
పోవునప్పుడేదో పోయెనంచు
చింతజేయునరుడు చిత్తంబునందున
రాయరేవచించు రమ్య రీతి 52

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

నీరుపల్లమెరుగు నిజముదేవుడెరుంగు
కప్పిపుచ్చుకొన్న తప్పుతెలియు
తప్పుచేసినోడు తప్పించుకోలేడు
రాయరేవవించు రమ్య రీతి 53

విత్తమిచ్చుచున్న వేశ్యప్రేమించును
చిత్తమిచ్చినిన్ను చేరనిచ్చు
అర్థమివ్వకున్న నద్దుకురానీదు
రాయరేవవించు రమ్య రీతి 54

నోరుమంచిదైన నూరుమంచిదెయగు
పరుషమైనవాక్కు పగను తెచ్చు
ఈటెపోటుకంటె పోటుమాటేఘాటు
రాయరేవవించు రమ్య రీతి 55

తొందరుండరాదు తోచిన రీతిగా
పలుకరాదుపలుకె మూలికియగును
అచితూచిపలుక నందరుమెత్తురు
రాయరేవవవించు రమ్యరీతి 56

అడ్డుచెప్పువాని హతముగావించుటే
రాజకీయతంతు రోజుకొకని
హితముజెప్పవినునె ఈశ్వరుడైనను
రాయరేవవించు రమ్యరీతి 57

ప్రజలబ్రోచుచుండె పాతకాలమురాజు
దోచుకొనును నేటిదుష్టనేత
కాలమిట్టులాయె కడతేరుటెట్లనో
రాయరేవవవించు రమ్యరీతి 58

## ఎల్లారెడ్డి సూ_క్తిముక్తావలి

నోట్లుపంచిప్రజల ఓట్లుసంపాదించి
కోట్లకొలదిధనము కూడబెట్టి
ఓట్లవేయనీరు ఓట్లుతామ్మేగుద్ది
రాయరేవబించు రమ్యరీతి 59

వెనుకబడ్డవార్ని బెనుకేసుకొనివచ్చి
వెనుకవచ్చువారి వెన్నువిఱచి
వారికందకుండ వీరెభోంచేస్తారు
రాయరేవబించు రమ్యరీతి 60

యు_క్తియు_క్తమైన యు_క్తిగై కొనవచ్చు
చిలుకదై న చిన్నశిశువుదై న
ఆడవారిదై న నన్యులదై నను
రాయరేవబించు రమ్యరీతి 61

కవితవ్రాయవచ్చు కమ్మనిపద్యాలు
నీతిజెప్పవచ్చు నేర్పుతోడ
చెప్పినట్టిదాని చేయుటేకష్టము
రాయరేవబించు రమ్యరీతి 62

చెప్పునట్టివాడు చేయలేడెచ్చట
చెప్పలేనివాడె చేయగలడు
తెలియనట్టివాడె తెలివిలోనడచును
రాయరేవబించు రమ్యరీతి 63

ఇరుగుపొరుగుతోడ నిష్టంబుగానుండి
పోరుపెట్టుకొనక నొరులతోడ
శాంతిగల్గియున్న సౌఖ్యంబుగల్గును
రాయరేవబించు రమ్యరీతి 64

చిన్నదానికైన పీటికిమాటికి
వాదులాడుకొనుచు వచ్చుచున్న
చచ్చునంతవఱకు శాంతియేదొరకదు
రాయరేవబించు రమ్యరీతి 65

పల్లెటూర్లలోన పగబెట్టుకొనరాదు
పగలురగిలి సెగలురేగుచుండు
పంతమంతకంత కంతంబుగాకుండు
రాయరేవబించు రమ్యరీతి 66

విద్యలెన్నినేర్చి వేదాలుచదివిన
లేదుకాదటంచు వాదులాడు
తర్కమెరుగుదాని తత్వంబునెరుగడు
రాయరేవబించు రమ్యరీతి 67

చంద్రుడొక్కడైన చక్కనివెలుగిచ్చు
చుక్కలెన్నియున్నలెక్కలేదు
పుత్రుడొక్కడైన పురుషోత్తముడువాలు
రాయరేవబించు రమ్యరీతి 68

పుట్టకున్నమేలు పుట్టిగిట్టినవాలు
పుట్టిమూర్ఖుడైన పట్టికంటె
మొప్పెవానితోడ ముప్పూటముప్పెను
రాయరేవబించు రమ్యరీతి 69

బిడ్డలున్నమేలె దొడ్డవారైనచో
మడ్డివారలైన బిడ్డలేల
బుద్ధిలేనివారు భూమికిభారమే
రాయరేవబించు రమ్యరీతి 70

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

త్రాగుబోతుతండ్రి తలవంపుతల్లియు
మూర్ఖుడైనసుతుడు ముదిమియువతి
శత్రులౌదురెందు సన్మార్గగామికి
రాయరేవచించు రమ్యరీతి 71

పుష్పమాశ్రయించి పురుగైనశివుజేరు
శిల్పిజేరిశిలయు శివుడెయగును
ఆశ్రయంబుబట్టి యధముడున్నతుడౌను
రాయరేవచించు రమ్యరీతి 72

కొమ్ములున్నపశువు గోర్లున్నజంతువు
కోరలున్నమృగము క్రొవ్వునరుడు
దూరముండకున్న దుఃఖంబుగలిగింత్రు
రాయరేవచించు రమ్యరీతి 73

మూడువాసరములో మూడుమాసంబులో
మూడువత్సరములో ముగియులోన
పాపపుణ్యకర్మఫలము ఫలించును
రాయరేవచించు రమ్యరీతి 74

మనసులోననొకటి మాటలోనొక్కటి
కార్యమందునొకటి కానవచ్చు
దుష్టబుద్ధికెపుడు దూరాననుండుము
రాయరేవచించు రమ్యరీతి 75

దైవపూజచేసి దానవులెందరో
వరముబడసి కరముగరువమొంది
చెడ్డపనులుచేసి చెడిపోయిరేగదా
రాయిరేవచించు రమ్యరీతి 76

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

రావణాసురుండు బ్రాహ్మణుడైనను
బ్రహ్మపుత్రుడైన ఫలితమేమి
కులముగొప్పదైన గుణముహీనంబయ్యె
రాయరేవచించు రమ్యరీతి 77

పరులమేలుగోరి పాలిచ్చుగోవులు
పరులకొఱకు యేర్లుపారుచుండు
చెట్లుపండ్లనిచ్చు చేలుపంటలనిచ్చు
రాయరేవచించు రమ్యరీతి 78

ప్రతిఫలింబుగోరి పరులకుమేల్జేయు
బుద్ధికొందరకును పొడముచుండు
కొందరేమికోర కుండమేల్జేతురు
రాయరేవచించు రమ్యరీతి 79

దేశసేవజేయ దీక్షబూనితినేను
నన్ను ఒట్లువేసి ఎన్నుకొనుడు
అన్నవాడుగెల్చి మన్నుజట్టునుగదా
రాయరేవచించు రమ్యరీతి 80

ప్రజలసేవజేయ ప్రభువేలకావలె
మంత్రియేల రాజ్యతంత్రమేల
తానుజేయుపనిని తాజేయుటేసేవ
రాయరేవచించు రమ్యరీతి 81

హత్యలైనజేసి అధికారమునకొచ్చు
మ్లేచ్ఛువలననేమి మేలుజరుగు
హత్యజేయుటందు నభివృద్ధియేగాని
రాయరేవచించు రమ్యరీతి 82

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

దుడ్డుకూడబెట్టి దుండగీండ్రనుబెంచి
రాజ్యమేలువారె పూజ్యులైరి
అట్టివారెమరల నధికారులౌదురు
రాయరేవచించు రమ్యరీతి 83

తెలివిగలుగువారె దేశనాయకులైరి
వైద్యులింజనీర్లు వారెయైరి
తెలివితోడప్రజల తెగదోచుకొందురు
రాయరేవచించు రమ్యరీతి 84

ఆశకంతులేదు అధికారులకునైన
జీతమెంతయున్న తృప్తిలేదు
లంచమివ్వకున్న మంచమెక్కరుకదా
రాయరేవచించు రమ్యరీతి 85

మరణమెవరికైన మామూలుతప్పదు
ధాతకైన వానితాతకైన
జన్మతోడచావు జతజేరివచ్చును
రాయరేవచించు రమ్యరీతి 86

హరుడుహరియుబ్రహ్మ సురనాధులకునైన
జన్మకర్మఫలము జరిగితీరు
తానుజేయుకర్మ తలవ్రాతగామారు
రాయరేవచించు రమ్యరీతి 87

సర్వభూతములను సమబుద్ధితోజూచు
మానవుండుహింస మానుకొనును
భూతహింసచేసి పూజింపఫలమేమి
రాయరేవచించు రమ్యరీతి 88

గుళ్లగోపురాల రాళ్లరప్పలయందు
దేవుడుండునంచు తెలుసుకొన్న
ప్రాణులందునేల పరమేశ్వరుడులేడు
రాయరేవచించు రమ్యరీతి 89

వేగిలేయగానె వేయిగండంబులు
వ్యాధిశోకమరణ బాధలందు
ఏదిఎవరికైన నెప్పుడైననువచ్చు
రాయరేవచించు రమ్యరీతి 90

తనువుశాశ్వతంబు తానుచిరంజీవి
ననుచతలచు వెఱ్ఱిమానవుండు
నీటిలోనిబుడగ నీజీవితముసుమా
రాయరేవచించు రమ్యరీతి 91

కనకకామినులను కవులుదూషింతురు
భ్రాంతిగోలుపునంచు పలుకుచుంద్రు
స్థిమితమైనబుద్ధి తమకులేదనుకోరు
రాయరేవచించు రమ్యరీతి 92

లోపలున్నదుష్ట లోభమోహాదుల
నిగ్రహింపలేక నీతిలేని
పనులజేయుచుండు పండితుడైనను
రాయరేవచించు రమ్యరీతి 93

కోపమెక్కువైన తాపంబుగల్గును
తాపమధికమైన తనువుమఱచు
తనువుమఱచినపుడు తప్పులుజరుగుచు
రాయరేవచించు రమ్యరీతి 94

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

నేలనింగినీరు నిప్పుగాలులచేత
చేయబడిన శ్రేష్ఠకాయమైన
శాశ్వతంబుగాదు సర్వకాలంబును
రాయరేవబింపు రమ్యరీతి 95

వెంకటేశ్వరునకు వెండ్రుకలర్పించి
కోర్కెలేలసురల కోరుకొనుట
తలపులేనియపుడె తలగుండుచేయాల
రాయరేవబింపు రమ్యరీతి 96

అల్పులైనకూడి ఐకమత్యముపొంది
బలముగల్గువారి బట్టవచ్చు
చీమలన్నిచేరి పామునుపట్టవా?
రాయరేవబింపు రమ్యరీతి 97

పండితుండులేని ప్రాంతంబునందున
అల్పబుద్ధియైన సాధ్యుడగును
పల్లెటూరిలోన బడిపంతులేగొప్ప
రాయరేవబింపు రమ్యరీతి 98

చెప్పినట్టిమాట తప్పరుపూజ్యులు
ప్రాణదేహవిత్త భంగమైన
కర్ణశిబిదధీచి కాయంబులొసగిరి
రాయరేవబింపు రమ్యరీతి 99

ఒప్పుకున్నపనిని తప్పకజేయుటే
దేశసేవమఱియు దేవసేవ
పనినిజేయనట్టి పామరిపోమరి
రాయరేవబింపు రమ్యరీతి 100

సాధ్యమైనవరకు సర్వజీవులకును
మేలుచేయువాడె మేటినరుడు
అదియెదైవపూజ ఆర్యధర్మంబును
రాయరేవవించు రమ్యరీతి 101

జిహ్వకొక్కరుచియు శీర్షంబుకొకబుద్ధి
ఉండుగానభేద ముండుమెండు
భేదమెంతయున్న వాదుమంచిదిగాదు
రాయరేవవించు రమ్యరీతి 102

ఆలుమగలకైన నరపొచ్చెములువచ్చు
మఱచిపోవుగుణము మంచిదగును
వైరభావమెంత వారికైననువద్దు
రాయరేవవించు రమ్యరీతి 103

రూపనామక్రియలు రూపింపగారాదు
సృష్టికర్తయెవరొ చెప్పగాదు
బుద్ధిపుట్టినట్లు బోధలుచేతురు
రాయరేవవించు రమ్యరీతి 104

తానుబాగుపడిన తరువాతనితరుల
బాగుచేయుకొఱకు పాటుపడుము
తన్నుమాలినట్టి ధర్మంబుకొఱగాదు
రాయరేవవించు రమ్యరీతి 105

ముదిమిలోనతనువు ముడతలుపడిపోవు
కండ్లుచెవులుకూడ కనవువినవు
భార్యబిడ్డలైన బాగుగచూడరు
రాయరేవవించు రమ్యరీతి 106

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

ఎంతగడుపుకున్న నెవరియొద్దకుపోయి
తిరిపెమడుగరాదు దేహియందు
చేయిచాచినపుడె చెడిపోవుమర్యాద
రాయరేవచించు రమ్యరీతి 107

విక్రమార్కభోజ శ్రీకృష్ణరాయలు
ఏలినట్టిరాజ్య మెక్కడుంది
కవులువ్రాసినట్టి కావ్యాలుగలవింక
రాయరేవచించు రమ్యరీతి 108

విక్రమార్జితంబు వీరభోజ్యంబైన
అవనియెవనియబ్బ యాస్తిగాదు
శాశ్వతంబుగాదు శత్రువౌమిత్రుడు
రాయరేవచించు రమ్యరీతి 109

స్వార్జితంబుసత్వ శక్తియుక్తంబైన
కవితఉన్నయట్టి కవికినేల
భార్యబిడ్డలైన బ్రతకనిరాజ్యంబు
రాయరేవచించు రమ్యతి 110

కలియుపండితుండు గాయకుడైననను
కలలతోనెబ్రతుక వలనుగాదు
గౌరవంబులేదు కలలగుర్తింపరు
రాయరేవచించు రమ్యరీతి 111

పరులుగౌరవింప వలెనంచుతలపక
పరహితంబుచేసి బ్రతుకవలెను
పరులపైనబడక బ్రతుకుటేధర్మంబు
రాయరేవచించు రమ్యరీతి 112

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

తెలుపకున్న తెలియు తెలిసినవారికి
తెలుసుకొనును తెలుప తెలియకున్న
తెలిసి తెలియకున్న తెలుపంగతరమౌన
రాయరేవబించు రమ్యరీతి 113

సద్గుణంబుతాని చదువేలతలపంగ
సద్గుణంబులున్న చదువులేల
చదువురాకయున్న చాకలిమేలన్న
రాయరేవబించు రమ్యరీతి 114

వినయమున్నయెడల విద్యరాణించును
దానమున్నయెడల ధనముమెఱయు
మంచిమనసుగల్లు మనిషిమాన్యుండౌను
రాయరేవబించు రమ్యరీతి 115

తెలివిలేనివాడు తెగనీల్గుచుండును
తెలివియున్నవాడు తెలియకుండు
నిండునీల్లులేని కుండమెండుగమ్రోకు
రాయరేవబించు రమ్యరీతి 116

అన్నిలోహములకు నతుకువేయగవచ్చు
కాచికరుగబోసి కలుపవచ్చు
కులముమతముమాని కూడియుండరుగదా
రాయదేవబించు రమ్యరీతి 117

మతములెన్నియున్న మానవులొక్కటే
చిత్రమైనజాతి చెప్పనేల
దేవుడొక్కడుండ దేనికి భేదంబు
రాయరేవబించు రమ్య రీతి 118

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావళి

కులముగొప్పకాదు గుణమెగొప్పదియౌను
మతముమిన్నగాదు మనసుమిన్న
చెప్పువారుకలరు చేయువారేలేరు
రాయరేవవచించు రమ్య రీతి 119

మరణమెప్పుడైన నరునకుసహజంబు
దానిగూర్చిచింత మానుకొనుము
బ్రకుకుతెరవుగూర్చి బాగుగాయోచించు
రాయరేవచించు రమ్య రీతి 120

ప్రజలసేవజేయ ప్రభుతనాకిమ్మంచు
బ్రతిమలాడుకొనెడు పనియెతగదు
సేద్యమైనచేసి సేవచేయగవచ్చు
రాయరేవవచించు రమ్యరీతి 121

కష్టపడెడువాడు శిష్టుడైవెలగును
సోమరైనవాడె పామరుండు
కర్మజేయువాని కాయంబుచెడిపోదు
రాయరేవచించు రమ్యరీతి 122

మాంసమద్యమాది మత్తుపదార్థాలు
తిండిబాగతినుచు కండబెంచి
గుండెపోటువచ్చి కుప్పకూలునుగాదె
రాయరేవవచించు రమ్యరీతి 123

తిండిదండిగతిని తీరికగానున్న
రక్తమధికమగును శక్తితరుగు
పనులుజేయకున్న పాడౌనుదేహంబు
రాయరేవచించు రమ్యరీతి 124

## వీల్లారెడ్డి సూక్తిముక్తావలి

పనులుచేయకుండి పైపైనతిరుగుచు
ఊరియరుగుజేరి యుబుసుపోక
మాటలాడుకొనెడు మనుజులుమనుజులా!
రాయరేవవించు రమ్య రీతి 125

శ్రేష్టజేష్టలెట్లు చేయుదురోచూచి
ఇతరులెల్లనట్లె చేతురవని
శ్రేష్టజేష్టలెపుడు చెడుత్రోవబోరాదు
రాయరేవవించు రమ్య రీతి 126

తల్లిదండ్రిగురువు దైవంబుపైభక్తి
కలిగిమెలగవలెను బాలురెల్ల
పెద్దవారిక్రింతి పిన్నలునడవాలి
రాయరేవవించు రమ్య రీతి 127

పూలగుత్తిబోలు పుణ్యాత్ములెల్లరు
గౌరవంబుహొందగలరు, లేక
ఉన్నచోటనైన ఉత్తములౌదురు
రాయరేవవించు రమ్యరీతి 128

కఱవుదేశమంత మఱిమఱీవచ్చినా
మంచినీటికొఱత మించుచున్న
తీర్చువారులేరు తిప్పలుమెండాయె
రాయరేవవించు రమ్యరీతి 129

రాయలేలినట్టి రత్నాలసీమయే
రాల్లసీమగాదె నీల్లులేక
కండ్లనీల్లురావు కడకునేడ్చినగూడ
రాయరేవవించు రమ్యరీతి 130

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

కుయ్యిమొఱ్ఱోయంచు గుండెనీరగునట్లు
ప్రజలుయేడ్చుచున్న పలుకనట్టి
రాతిగుండెవారె రాజులౌచున్నారు
రాయరేవచించు రమ్యరీతి 131

వెఱ్ఱిసామివేమొ వెంకటేశ్వరనీవు
మోసపోదువయ్య మ్రొక్కినంత
అశపోతువారి కధికారమిస్తావు
రాయరేవచించు రమ్యరీతి 132

కల్లబొల్లిమాటలెల్ల చల్లగజెప్పి
మంత్రులైనపిదప మరచునట్టి
మంత్రిగాళ్లరాజ్య తంత్రంబులిట్టివె
రాయరేవచించు రమ్యరీతి 133

భూమిలోననీరు బొత్తుగాలేదయ్యె
పైనవానకూడ పడకపోయె
నీరునిలువజేయు నీరధులాలేవు
రాయరేవచించు రమ్యరీతి 134

బియ్యమిచ్చెదమన బీదలునమ్మిరి
వారివెర్రిగాని వర్రిపైరు
నీరులేకపోవ నిలువునాయెండదా
రాయరేవచించు రమ్యరీతి 135

నీవునిలిచినట్టి నేలనీరేలేదు
గంగయెచటికేగె జంగమయ్య
కలవురానితెరవు కనుగొనుమికనైన
రాయరేవచించు రమ్యరీతి 136

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

కాలమెుక్కరీతి కలకాలముండదు
మార్పుజెందుచుండు మాపురేపు
నేర్పుఓర్పుగల్గి నెరవేర్చుకార్యంబు
రాయరేవబించు రమ్యరీతి 137

ధర్మమనుసరించి ధనముసంపాదించి
ధనముకొలది సుఖములనుభవించి
భుక్తిముక్తిపొందు భువిలోనెవిజ్ఞాని
రాయరేవబించు రమ్యరీతి 138

సూర్యచంద్రులకును చూచుచుండగవచ్చె
క్షీణవృద్ధిదశలు క్షణములోన
ఉచ్చనీచదశలు వచ్చునుపోవును
రాయరేవబించు రమ్యరీతి 139

స్త్రీనిజూడ పురుషచిత్తముచిత్తౌను
పురుషుజూచినంత పొలతికరుగు
దానిలోనికిటుకు ధాతకేతెలియదు
రాయరేవబించు రమ్యరీతి 140

దేహమెంతవెలుగు దేదీప్యమానమై
కలుగులోనంత కల్మషంబు
తలచుకున్నదాని తలపుజనించదు
రాయరేవబించు రమ్యరీతి 141

శుభ్రపఱచుకొన్న శుచియైనపోవునా
చెమటవలనకలుగు చెడ్డకంపు
మాంసరక్తమూత్ర మలములన్నియుకంపె
రాయరేవబించు రమ్యరీతి 142

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

దేహమంతమైన దేహంబులోనున్న
ఆత్మనాశమవ దటంచుసుడువ
దేనికింకభయము దేహికికలుగును
రాయరేవచించు రమ్యరీతి 143

ఆత్మయిట్టిదట్టిదనుచు వర్ణించిరి
తోచినట్లుగాగ తొల్లిబుషులు
ఆత్మతత్వమెరుగ నందరివశమౌన
రాయరేవచించు రమ్యరీతి 144

తన్నుతానెచంపి తినుటనదేవుండు
పాపపుణ్యఫలము పరులకేల
క్రూరకర్మజూడకరుగదా హృదయంబు
రాయరేవచించు రమ్యరీతి 145

ఖగముమృగమునరుని కాయంబుభక్షించు
మాంసమేదియైన మనిషితినును
బోధపడదునాకు భేదంబువీరిలో
రాయరేవచించు రమ్యరీతి 146

మాంసభక్షణంబు మానలేకున్నారు
మనుజులెంత బుద్ధిమంతులైన
గొంతుకోయుటెంత ఘోరమోయెరుగరు
రాయరేవచించు రమ్యరీతి 147

ప్రాణభయముతోడ పరులనునమ్మక
నీదువెంటతిరుగు నిన్నునమ్మి
ఐనవానినీవె హత్యగావింతువా!
రాయరేవచించు రమ్యరీతి 148

పుణ్యపురుషదేవ పూజకుతగినట్టి
పూలగ్రుచ్చికూర్చి మాలజేసి
నీచమెడకువేసి నేరంబుచేయకు
రాయరేవబించు రమ్యరీతి 149

వేదికెక్కివేద వేదాంగమంతయు
చెప్పువారుగలరు చేయువారు
ఊరికొక్కరైన నున్నారచెప్పండి
రాయరేవబించు రమ్యరీతి 150

ఆత్మతత్వమేమొ ఆలోచనముచేసి
ఎవరియంతవారె ఎరుగవలెను
వెన్నపెరుగులోన నున్నదివిలికిన
రాయరేవబించు రమ్యరీతి 151

ఎన్నియేండ్లకైన నెన్నిజన్మలకైన
శ్రద్ధభక్తిబుద్ధి శద్ధమైన
జీవనంబులేక శివతత్వమెరుగరు
రాయరేవబించు రమ్యరీతి 152

పూర్వకాలమందు పురుషపుంగవులకు
పైనఅంగ వస్త్రమైనలేదు
స్త్రీలుదేహమంత చీరతోకప్పిరి
రాయరేవబించు రమ్యరీతి 153

నేడుపురుషులెల్ల నిండుగాబట్టలు
వేసివల్లుకప్పి వేయుచుండ
స్త్రీలచందమన్న సిగ్గానుచెప్పంగ
రాయరేవబించు రమ్యరీతి 154

ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

పాతకాలయందు నటనజేయుటకైన
స్త్రీలవేషములకు స్త్రీలురారు
నారివేషమైననరుడు వేయుచునుండె
రాయరేవచించు రమ్యరీతి 155

పురుషపుంగవుండు పూబోడియునుగూడి
ఆలుమగల వేసమైనవేసి
దూరదూరముండి దరిజేరకుండిరి
రాయరేవచించు రమ్యరీతి 156

చిత్రమౌనుచూడ సినిమాలయందున
నటనజేయునపుడు నరుడునారి
క్రిందమీదపడుచు చిందులువేతురు
రాయరేవచించు రమ్యరీతి 157

అవయవంబులన్ని అగుపించునట్లుగా
వేషమేయునట్టి యోషజూడ
మునలివానికైన మోహంబుగలుగదా!
రాయరేవచించు రమ్యరీతి 158

చిత్రసీమలందు స్త్రీలుసిగ్గునువీడి
చేయుచున్న దుష్టచేష్టచూడ
ఆటబొమ్మలైరి అపవారనుపించు
రాయరేవచించు రమ్యరీతి 159

స్త్రీలుచీరకట్టి చేలచెరంగును
పైనకప్పుకొన్న కానరాదు
మర్మమైనభాగ మదియేలచేయరో
రాయరేవచించు రమ్యరీతి 160

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

హాలివాలినట్టి చోలిధరింతురు
బొడ్డుక్రింద కోకగుడ్డకట్టి
వెనుకముందుకూడ కనుపింపజేతురు
రాయరేవబించు రమ్యరీతి 161

మానభంగములను ప్రాణాలుతీయుట
ముష్టియుద్ధములను మోసములను
చేసిచూపునట్టి సినిమాలుమెండాయె
రాయరేవబించు రమ్యరీతి 162

పల్లెపట్టణాల పంతాలుహెచ్చెను
ఒకరినొకరుచూచి ఓర్వలేరు
పెద్దచిన్నలేదు ఒద్దికలేవు
రాయరేవబించు రమ్యరీతి 163

పరులతిట్టుచున్న పరులచంపినయట్లు
తన్నుపొగడుకొనుట తననుచంపు
కొన్నయట్లుగాన కూడవీరెండును
రాయరేవబించు రమ్యరీతి 164

ఒక్కమనిషి యెంతచక్కగాచెప్పిన
చెల్లనేరదెందు కల్లబొల్లి
మాటలైనపెక్కు మందిచెప్పినచెల్లు
రాయరేవబించు రమ్యరీతి 165

జనమధముగల్గు మనుజుడేమన్నను
ఘనతగౌరవంబు గలుగుచుండు
అవియెలేనివేల నవమానమగుచుండు
రాయరేవబించు రమ్యరీతి 166

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

బ్రహ్మసృష్టిలోని బహుసుందరంబైన
వస్తువేదియన్న వనితగాదె
మంచిగుణములైన మగువలలోమెండు
రాయరేవచించు రమ్యరీతి 167

ఈసుయేసుకృష్ణ క్రీస్తురామరహీము
ఏమిపేరుతోడ నెవరుపిలువ
దేవుడొక్కడన్న దేనికితగవులు
రాయరేవచించు రమ్యరీతి 168

నాదుమతముగొప్ప నాదేవుడేగొప్ప
యనెడువాదు మంచిదౌనెచూడ
ఏదిజన్మమతమొ అదివారికిష్టమౌ
రాయరేవచించు రమ్యరీతి 169

మతముమనకు మంచిమార్గముచూపించు
నీతినియమములను నేర్పుత్రోవ
మనహితంబుకొరకె మతధర్మములువచ్చె
రాయరేవచించు రమ్యరీతి 170

గీతగీతయంచు గీతనుగొప్పగా
వాతచెప్పినంత వచ్చునేది
చేసిచూపవలెను చెప్పినదానిని
రాయరేవచించు రమ్యరీతి 171

ముంతచెంతనున్న మున్నీటముంచిన
పొంతలోననైన ముంతనీళ్లె
ప్రాప్తమెంతయున్న ఫలితమంతేవచ్చు
రాయరేవచించు రమ్యరీతి 172

ధనమదాంధులైన ధర్మహీనుల్రమోల
మోకరిల్లి దీనముఖముతోడ
చేతులొగ్గుకంటె చెడుటేమికలదన్న
రాయరేవవించు రమ్యరీతి 173

తనకుతోచినంత తానుచెప్పచునుండు
ఒప్పుకొనడొకండు చెప్పుదాని
తాటినెక్కువాని తలదన్నువాడుండు
రాయరేవవించు రమ్యరీతి 174

శాంతశమదమాది సద్గుణంబులనెల్ల
ఎల్లవేసినంత వచ్చునేది
ఆచరించిచూప నధికుడౌచూడగా
రాయరేవవించు రమ్యరీతి 175

బ్రతుకుతెలవులేక బాధలుపడలేక
పిరికిపందయగుచు బెదరిపోయి
చచ్చిపోవువాడు చచ్చుదద్దమ్మరా
రాయరేవవించు రమ్యరీతి 176

చచ్చిపోయిపిదప సాధించునదియేది?
బ్రతికిబట్ట కట్టవలెనుగాని
ఆత్మహత్యజూడ నతిపాతకంబౌను
రాయరేవవించు రమ్యరీతి 177

కష్టనిష్ఠురములు కడగండ్లుకలిగిన
నేర్పుతోడబ్రతుక నేర్వవలెను
అంతెగానిఆత్మహత్య దోషంబౌను
రాయరేవవించు రమ్యరీతి 178

## ఏల్లారెడ్డి సూక్తిముక్తావలి

రచ్చబండలెక్కి రాజ్యాంగమంతయు
వల్లెవేయుచుండ్రు పిల్లపెద్ద
చీకటిచ్చగానే చీకటిపడుదాగ
రాయరేవచించు రమ్యరీతి 179

చదువుచెప్పువారు చదువుచెప్పుటలేదు
చదువుకొనెడివారు చదువుకొనరు
ఎవరిపనినివారు ఎవ్వరూచేయరు
రాయరేవచించు రమ్యరీతి 180

నరుడుచెప్పినట్లు నాట్యంబుచేయును
ఏనుగెంతదైన నేమిఫలము
దేహబలముకన్న ధీబలంబేమిన్న
రాయరేవచించు రమ్యరీతి 181

మనసునందునొకటి మాటయందొక్కటి
కర్మయందునొకటి దుర్మతులకు
సన్మతులకుమూడు సమముగానుండును
రాయరేవచించు రమ్యరీతి 182

బాల్యమందుతండ్రి భర్తయౌవనమున
వార్ధకముననైన వారిసుతులు
ఆడవారికేమి హానిచేయగరాదు
రాయరేవచించు రమ్యరీతి 183

తల్లితండ్రిగురువు తగినరీతినిపెంచి
పెద్దచేసి విద్దెబుద్ధినేర్పి
తీర్చిదిద్దకున్న తీరరుబిడ్డలు
రాయరేవచించు రమ్యరీతి 184

ధనముగలిగెనేని గుణముకులమురూపు
వెలయుచుండునెల్ల విద్యలెల్ల
ధనములేనియెడల తగ్గునన్నియుగూడ
రాయరేవబించు రమ్యరీతి 185

బిందుబిందుగాగ బిందెలోపడినచో
నిండిపోవు బిందెనీటితోడ
పదముపదమునేర్వ పాండిత్యమబ్బును
రాయరేవబించు రమ్యరీతి 186

దున్నపోతులేమి దుర్మార్గమొనరించె
మేకపోతులెవని పీకకొరికె
జంతువులనుజంపు జనులిట్లుచత్తురు
రాయరేవబించు రమ్యరీతి 187

జాతరలనుచేసి జంతువులనుజంపి
పాపమేలచేయ వలెనుమరల
రక్తపాతమునకు రాల్లైనకరుగునె
రాయరేవబించు రమ్యరీతి 188

మాటలందుతీపి మదిలోనచేదున్న
నరునిమాటనమ్మి నాశమవకు
మాటకఠినమైన మనసుమంచిగ్రహించు
రాయరేవబించు రమ్యరీతి 189

దుష్టులున్నచోట శిష్టులుండగరాదు
శిష్టుడనుభవించు దుష్టఫలము
కాకిచెంతజేరి కడతేరెహంసము
రాయరేవబించు రమ్యరీతి 190

ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

కండ్లుపండ్లుచండ్లు తుండ్లుబాగుండిన
అందమైనవారె ఆడవారు
స్థిమితమైనబుద్ధి శీలముముఖ్యము
రాయరేవచించు రమ్యరీతి 191

కులముకలదునేడు కులధర్మములులేవు
మతముగలదుగాని మంచిలేదు
కులములేకయున్న కులధర్మముండాలి
రాయరేవచించు రమ్యరీతి 192

కార్యసాధనమున కఠినమౌశిలయౌను
బాధచూడ పూలబంతియగును
గొప్పవారిమనసు గోచరంబెట్లౌను
రాయరేవచించు రమ్యరీతి 193

ఆటలాడువారు పాటపాడేవారు
ఆకులాడువారు షోకుగాండ్రు
త్రాగుబోతుగాండ్రు తగుదురెండ్రైనను
రాయరేవచించు రమ్యరీతి 194

వల్లువంచనోల్లు వల్లుపెంచేవాల్లు
తిరుగుబోతువాల్లు తిరిపెమోల్లు
బూటుసూటుకోటు నీటుగావేతురు
రాయరేవచించు రమ్యరీతి 195

తిండిబాగతినుచు కండలుపెంచుచు
మీసములనుపెంచి వేసమేసి
మోసములనుచేయు మొనగాండ్రుమెండైరి
రాయరేవచించు రమ్యరీతి 196

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

కష్టపడుచు కాయకష్టముచేయుచు
కూడుగుడ్డగూడు కూడలేక
బక్కచిక్కి బడుగుపడునెల్లయిడుముల
రాయరేవవచించు రమ్యరీతి 197

తల్లిదండ్రిలేని పిల్లలుపాపము
చదువుసంధ్యలేని చవటలగుచు
వెట్టిచాకిరీలు విడువలేకున్నారు
రాయరేవచించు రమ్యరీతి 198

భర్తబాధపడెడు భార్యలుకొందరు
భార్యబాధపడెడు భర్తయొకడు
తల్లిదండ్రులకును తనయులతోబాధ
రాయరేవచించు రమ్యరీతి 199

చిత్రసీమమరియు చిత్రంబుకలిగించు
చేసిచూపుతారు చెడ్డపనులు
నటులువిటులుచేయు నటనలేనేర్తురు
రాయరేవచించు రమ్యరీతి 200

ఊరుఊరునందు నుద్రేకములుగల్గె
దద్దరిల్లుబాంబు శబ్దములకు
గన్నునుండివెడలి ఘర్జించుతూటాలు
రాయరేవచించు రమ్యరీతి 201

ఎన్నికలలతోనో ఎన్నికలనుబెట్ట
కల్లలాయనన్ని కలలుగూడ
కలతలెక్కువాయె కలహాలుమెండాయె
రాయరేవచించు రమ్యరీతి 202

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

కోట్లకొలదిధనము ఓట్లకైవెచ్చించి
కాలమైనపూర్తి కాకముందె
పెత్తనంబుకొఱకు కత్తులునూరుటె
రాయరేవచించు రమ్యరీతి 203

ముందురాజులైన పొందికలేకనే
ఒరులతోడజేరి యొకరినొకరు
చంపుకొనుచుతాము చచ్చిపోయిరికదా?
రాయరేవచించు రమ్యరీతి 204

ఐకమత్యముండి యసహాయశూరులై
పోరుసలిపియున్న పరులుమనల
ఏలువారుకాదు యిన్నాళ్లువఱకైన
రాయరేవచించు రమ్యరీతి 205

ముందుబోలెమరల మొదలాయెచూడగా
పెత్తనంబుకొరకు పెనుగులాడి
విత్తమొచ్చినట్లు చీలిపోతున్నారు
రాయరేవచించు రమ్యరీతి 206

ఇంతతెలివితేట యింతవిజ్ఞానంబు
ముందెఉన్నయెడల ముండమోపి
యింగిలీసువాళ్లు యిన్నాళ్లుయేలేర
రాయరేవచించు రమ్యరీతి 207

ఒకడుఓడిపోయి యొకడుగెల్చునుగాని
గేలిచేయుపరుల గెలిచినోడు
అదియెఅతడుచేయు అభివృద్ధికార్యంబు
రాయరేవచించు రమ్యరీతి 208

భూమిపూజచేసి మొదలుపెట్టినదాని
పూర్తిచేయునట్టి పురుషుడేడి
ఆంధ్రులెప్పుడైన నారంభశూరులె
రాయరేవచించు రమ్యరీతి 209

ప్రాతవట్లెయుండ క్రొత్తవానిమరల
మొదలుపెట్టుచుంద్రు తుదలులేదు
బాడినట్టిదాని పూడైనతీయరు
రాయరేవచించు రమ్య రీతి 210

చిత్తమొచ్చినట్లు విత్తంబువెచ్చించి
చేతగానిపనులె చేయుచుంద్రు
చెక్కుచెదరకుండ చక్కగా
రాయరేవచించు రమ్య రీతి 211

బడులుమడులుగుడులు పాడగుచుండిన
చూచిచూడకుండు శూరవరులె
పాడుబడినవాని బాగుచేయరుకదా
రాయరేవచించు రమ్య రీతి 212

రాల్లతోడగట్టు గుల్లుగోపురములు
శాశ్వతంబులగుచు చక్కగుండె
వేలయేండ్లుగడువ మేలుగానున్నవి
రాయరేవచించు రమ్యరీతి 213

ఇప్పుడిండ్లుకట్టి నప్పుడేపీలును
కుప్పకూలిపోవు చెప్పకుండ
బోదకొట్టమైన బీదసాదకువాలు
రాయరేవచించు రమ్యరీతి 214

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

పంచకొంచురంత భాగాలుడబ్బును
కట్టరేదికూడ దిట్టముగను
కట్టడంబులన్ని మట్టిపాలై పోవు
రాయరేవచించు రమ్యరీతి 215

పట్టణాలలోని ప్రజలసౌకర్యాలు
పల్లెటూర్లలోని ప్రజలకేవి
పట్టణాలుప్రబలు పల్లెలుగుల్లగు
రాయరేవచించు రమ్యరీతి 216

వీలుగానిచోట వీలైనరీతిగా
అణగిపనుల చేసికొనగవలెను
పౌరుషంబుబలము పంతంబుకొఱగావు
రాయరేవచించు రమ్యరీతి 217

కలిమిలేమిమఱియు కష్టసుఖంబులు
గానులోనియరలు కదలునట్లు
మారిమారివచ్చు మనుజులకెల్లను
రాయరేవచించు రమ్యరీతి 218

ప్రభువు,వనితలతయు, ప్రక్కలోనున్నట్టి
వారిపైనచూపు పరచుగాని
దూరమున్నవారి పారజూడరుగదా
రాయరేవచించు రమ్యరీతి 219

రాజుప్రజలనెల్ల రంజించువాడౌను
ప్రజలకొఱకునిచ్చు ప్రాణమైన
ప్రజలదోచుకొనుచు భక్షించువాడౌన
రాయరేవచించు రమ్యరీతి 220

# ఎల్లారెడ్డి సూక్తిముక్తావళి

పరులధనముకొఱకు ప్రాకులాడేవాడు
పెత్తనంబు పొందనెత్తలేయు
ఉత్తమాటలాడి విత్తంబునార్జించు
రాయరేవవించు రమ్యరీతి 221

చదువురానివాడు సద్గుణంబులతోడ
బ్రతుకుచున్నబాలు బాగుపడును
దుర్గుణంబులున్న దుష్టునిచదువేల
రాయరేవవించు రమ్యరీతి 222

బ్రతుకుతెలుపుకొఱకు బడిపంతులగుటకో
చదువుకొనెడు నేటిచదువులెల్ల
నెయ్యిలేనివట్టి నేతిబీరనుబోలు
రాయరేవవించు రమ్యరీతి 223

సద్గుణంబురాని చదువులుమనకేల
వల్లుదాచనట్టి వలువలేల
ఇంటిబాగుమఱచు యిల్లాలుయేలరా
రాయరేవవించు రమ్యరీతి 224

ఇరుగుపొరుగుతోడ నిష్టంబుగానుండి
కలహములనుమాని మెలగవలెను
నూరుకొనగరాదు కాలాలుమిఱియాల
రాయరేవవించు రమ్యరీతి 225

మెత్తగున్నవాని సుత్తనాకొడుకండ్రు
గడుసుగున్నయడల గరివియండ్రు
హానిచేయనోని యసమర్థుడనియండ్రు
రాయరేవవించు రమ్యరీతి 226

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

చెడ్డవానికెంత సేవజేసినగాని
మంచిచేయబోడు మాటవినడు
పాముివిషముబెంచు పాలుత్రాపినగాని
రాయరేవచించు రమ్యరీతి 227

కుక్కతోకకెన్ని కట్లేసికట్టిన
కుట్లుతీయగానె కుంటువచ్చు
జన్మతోటిబుద్ధి జడునకుమారదు
రాయరేవచించు రమ్యరీతి 228

ఖలునకెంతనీతి గరపినఫలమేమి
దుష్టబుద్ధిపోయి శిష్టుడగునె
చెక్కరేసిపెంచ చేదువేపకుపోదు
రాయరేవచించు రమ్యరీతి 229

అడుగకున్ననైన నమృతంపుమాటలు
చెడెడువారికెల్ల చెప్పవలెను
చెడినపిదప చెప్పిచేయునదేముంది
రాయరేవచించు రమ్యరీతి 230

పొట్టకొరకుపడెడు పాట్లుచెప్పగరాదు
యుద్ధమునకునైన సిద్ధమగుచు
బాంబులేసిప్రజల భయపెట్టిగెలుతురు
రాయరేవచించు రమ్యరీతి 231

మంత్రతంత్రయంత్ర మహిమలుజూపుచు
ప్రజలమోసగించు పాడుపనులు
భుక్తిరక్తికొరకె ముక్తికికాదయా
రాయరేవచించు రమ్యరీతి 232

తానుచేసిచూపి తదుపరిచెప్పిన
ఒప్పుకొందురతని గొప్పతనము
చేయకుండిచెప్ప చీకొట్టుదురుగదా?
రాయరేవచించు రమ్యరీతి 233

గుండుకొండపైకి కొనిపోవురీతిగ
మంచిగుణము నేర్చుమానవుండు
చెడుగుణంబుక్రింద శిలత్రోయునట్టుల
రాయరేవచించు రమ్యరితి 234

శక్తితోడజేయ శక్యంబుగాకున్న
యుక్తితోడచేయు యుక్తిపరుడు
కాకిపాముజంపె కనకహారముతెచ్చి
రాయరేవచించు రమ్యరీతి 235

బుద్ధిబలముతోడ యుద్ధంబులేకయే
బలములేనివాడు పరులగెల్చు
నీటముంచెశశము మేటిసింహంబునే
రాయరేవచించు రమ్యరీతి 236

వినుటకింపుగాని వెగటుమాటైనను
మేలుసంతసంబు కలుగజేయు
ఇంపుసొంపుమాట కొంపలుకూల్చును
రాయరేవచించు రమ్యరీతి 237

వియ్యమైనమఱియు నెయ్యమైననుగాని
సమతగల్గునెడల చిక్కుగుండు
సమతలేనిచోట సరిగావురెండును
రాయరేవచించు రమ్యరీతి 238

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

కొండముచ్చులకును కుందేలుబోధించి
కీడుతెచ్చుకున్న జాడజూడ
బుద్ధిచెప్పరాదు బుద్ధిహీనులకెందు
రాయరేవచించు రమ్యరీతి 239

వానలోనతడియు వానరజాతికి
గూండ్లుయేల కట్టుకొనరటంచు
పక్షులున్నగూండ్ల పడగొట్టుకొనెగదా?
రాయరేవచించు రమ్యరీతి 240

అర్థమున్నవాడ నర్హుడై యున్నను
వానిసేవజేయ వచ్చుచుందు
దాసుడగుననరుడు ధనమున్నవానికి
రాయరేవచించు రమ్యరీతి 241

ప్రాజ్ఞుడై వాడు వరమానర్థకాంక్షియు
పణములేనియడల బతుకలేడు
పైసలోనెగలడు పరమాత్మచూడగ
రాయరేవచించు రమ్యరీతి 242

దానమున్నకడను ధనముండబోదన్న
కూడబెట్టువాని తోడనుండు
ధర్మబుద్ధివారి దగ్గరజేరదు
రాయరేవచించు రమ్యరీతి 243

కూడబెట్టుచున్న కోటీశ్వరుండౌను
కూడుగుడ్డకేమి కొరతరాదు
గౌరవంబుగల్గు ఘనుడౌనుమాన్యుడౌ
రాయరేవచించు రమ్యరీతి 244

ధనములేనివాడు గుణవంతుడైనను
విద్యవినయమున్న విలువలేదు
పండితుండుగాని పరమపావనుడైన
రాయరేవబించు రమ్యరీతి 245

గంజిలోకిఉప్పు గరిటెడులేకున్న
పాలలోకి గోరుపంచదార
భుక్తిజరుగకున్న భూములేలగజూచు
రాయరేవబించు రమ్యరీతి 246

గుడ్డియెద్దుచేలోపడ్డట్లు కొందరి
కోర్కెతీరుచుండు కోరినట్లు
అందరట్లుచేయ నపహాస్యమౌగదా
రాయరేవబించు రమ్యరీతి 247

కాసులేనివాడు కర్మచేయగలేడు
పీసమంతగూడ విలువరాదు
గోచిపాతగూడ గానలేడుమనలేడు
రాయరేవబించు రమ్యరీతి 248

ఎంతవారలైన కాంతకుదాసులె
కాంతకూడదాసి కనకమునకు
కనకమున్నయెడల శునకమ్ముసింహమౌ
రాయరేవబించు రమ్యరీతి 249

మోపగానినమ్మి మోసపోయెడివాడు
చేతగాకపోయి చెడెడివాడె
గొంతుగోయువాని గొఱ్ఱెనమ్మినయట్లు
రాయరేవబించు రమ్యరీతి 250

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

అప్పుకొనుటతప్పు తప్పకముప్పౌను
అప్పుచేసితినకు పప్పుకూడు
అప్పులేనివాడె ఐశ్వర్యవంతుడు
రాయరేవచించు రమ్యరీతి 251

ఆరిపోవుదీప మద్భుతంబుగమండు
చెడెడుమనిషిమెండు మిడిసిపడును
ఉరిమిమెరిసికురిసి ఉండునామేఘండు
రాయరేవచించు రమ్యరీతి 252

కంచెచేసుమేయ కాపుకావేదెట్లు
కాపులేకయెట్లు కాపుబ్రతుకు
కాపువానికాపి కాపాడుకాపేడి
రాయరేవచించు రమ్యరీతి 253

కడచిబ్రతికినట్లు గంతులువేయకు
ముందువచ్చు ముప్పుమొప్పెనరుడ
మంచినీల్లుకూడ మనకింకకరవగు
రాయరేవచించు రమ్యరీతి 254

కొరవితోడతలను గోకికొన్నట్టులే
కొంటెవానినెన్ను కొనుటజూడ
కుక్కతోకబట్టి గోదావరీదుటే
రాయరేవచించు రమ్యరీతి 255

రైకసింగారించి కోకనుమరచిన
కోమలాంగిరీతి క్రొత్తలోన
ఎన్నికైనవార లేమేనియెరుగరు
రాయరేవచించు రమ్యరీతి 256

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

అధరమందుమధువు అమృతంబుకలదను
కవులమాటవట్టికల్లసుమ్మ
మాటలోనమధువు మనసులోసుధకల్గు
రాయరేవచించు రమ్యరీతి 257

కడుపుచించుకున్న గాథడేఅందురు
కఠినచిత్తులైన కపటజనులు
బోధపడవుపరుల బాధలువారికి
రాయరేవచించు రమ్యరీతి 258

ఊరకున్నవాని మారెల్లఊపదు
పోరుపెట్టుకున్న నూరుచెడును
ఓర్పుగల్గువాడె నేర్పుగల్గినవాడు
రాయరేవచించు రమ్యరీతి 259

కూడులేనివాడు గుడ్డలేనమ్మను
తగులుకొన్నరీతి తలపవేడు
అధముడైనవాని కధికారమిచ్చుట
రాయరేవచించు రమ్యరీతి 260

చెప్పుక్రిందితేలు గుప్పిటిలోఈగ
పిల్లిచేతిలోని పిల్లఎలుక
బ్రతుకునట్లునేటి బడిపంతులగుబాట్లు
రాయరేవచించు రమ్యరీతి 261

ఢిల్లీకెల్లిఉల్లి తెల్లపాయలుతెచ్చి
కొబ్బెరేపి రుబ్బుకున్నరుచియె
పల్లెఉల్లి తెల్లపాయీలకుండునె
రాయరేవచించు రమ్యరీతి 262

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

జాతిమతము రూపుజనులకువేరైన
శుక్లశోణితంబు చూడనొకటి
నల్లతెల్లయాల పాలుతెల్లగనుండు
రాయరేవచించు రమ్యరీతి 263

ఏడ్చుదానిమగడు ఏనాడువచ్చునో
నామొగుండుకూడ నాడెవచ్చు
అనుచునూరకున్న నగునెట్లుకార్యంబు
రాయరేవచించు రమ్యరీతి 264

నారుపోసినోడు నీరుపోయకపోడు
అనుచునూరకున్న తినకనుండు
పొయ్యిపైనపెట్ట బియ్యంబువ్వౌన
రాయిరేవచించు రమ్యరీతి 265

ఆడవారిబ్రతుకు లరటాకులనుబోలు
చీలిపోవచెడిన చేటుగలుగు
ఆడిపోయువారె ఆడవారినిమెండు
రాయరేవచించు రమ్యరీతి 263

ఇల్లుయిరకటంబు ఇల్లాలుమరకటం
పిల్లలెల్ల కోతిపిల్లలైన
తల్లడిల్లిపోడె తండ్రియాయింటిలో
రాయరేవచించు రమ్యరీతి 267

దూడపొదుకుగ్రుమ్మ దుగ్ధంబుత్రాగిన
గోవుపాలుసేపు గోముసూపు
రాల్లతోడకొట్ట రాల్చుపండ్లనుచెట్లు
రాయరేవచించు రమ్యరీతి 268

నేతిబీరలోన నేయిలేనట్టుల
కఱ్ఱలేని జీలకఱ్ఱరీతి
పేరుగొప్పగాని ఊరుదిబ్బగుమండు
రాయరేవచించు రమ్యరీతి 269

పెంటలోనపాడి పంటలున్నవిదాగి
పూలమొక్కలందు ముల్లుగలవు
మంచిపెద్దలుండు నెంచిచూడదనెందు
రాయరేవచించు రమ్యరీతి 270

సర్వభూతములను సమముగాజూచుచు
కరుణదయయు ప్రీతికలిగియుండి
ద్వేషముండకున్న దేవుండవీవన్న
రాయరేవచించు రమ్యరీతి 271

నీకుఎవరులేరు నీవెవ్వరికికావు
ఏదినీదికాదు ఎందుకింక
నేనునాదిమఱియు నావారలందువు
రాయరేవచించు రమ్యరీతి 272

పరులునిన్నుచూచి భయపడగారాదు
పరులవలననీవు భయములేక
బ్రతుకునటులపనుల బాగుగచేయుము
రాయరేవచించు రమ్యరీతి 273

జ్ఞానసదృశధనము జగతిలోలేదొండు
శ్రద్ధతోడజదివి విద్దెనేర్చి
సకలశాస్త్రసార సంపదనార్జించు
రాయరేవచించు రమ్యరీతి 274

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

ధర్మమునకుహాని ధరణిలోజరిగిన
దివమునుండి భువికిదిగుచువచ్చి
మనుజజన్మమెత్తి మనలదేవుడుకాచు
రాయరేవచించు రమ్యరీతి 275

బలముజనముధనము కలదనిభావించి
చిట్టువీగబోకు వెట్టివాడ
కౌరవేశ్వరుండు గర్వంబుతోచచ్చె
రాయరేవచించు రమ్యరీతి 276

సుఖములనుభవింప సుఖరోగములుగల్గు
మరణమగునుతుదకు శరణమన్న
బ్రహ్మచారివైన బహులాభములుగల్గు
రాయరేవచించు రమ్యరీతి 777

శత్రుమిత్రబంధు పుత్రకళత్రాది
సర్వులందుసమత జరుపవలెను
ద్వంద్వములకుమార్పు జెందకుండుటమేలు
రాయరేవచించు రమ్యరీతి 278

కానరాకకండ్లు వినరాకచెవులైన
కట్టలేకమనిషి కదలలేక
పోవుగాకనరుడు చావన్నభయపడు
రాయరేవచించు రమ్యరితి 279

తోలుతిత్తిలోన గాలికల్గినదాక
లాలనమ్ముచేయు నాలిగూడ
దయ్యమంచుపిదప దవ్వుగాపోపును
రాయరేవచించు రమ్యరీతి 280

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

ధనముపోవుహద్దు దాటినవారికి
చెరువుతెగిననీరు తరలునట్లు
నీరులేనిచోట నిలువవుచేపలు
రాయరేవచించు రమ్యరీతి 281

అందచందమైన ఆడువారినిజూచి
భ్రాంతిచెందబోకు పరవశించి
మాంసరక్తమూత్ర మలములచోటది
రాయరేవచించు రమ్యరీతి 282

బాల్యమంత ఆటపాటలతోపోవు
యౌవనంబుగడచు యువతితోడ
ముసలితనములోన మోక్షంబువచ్చునా
రాయరేవచించు రమ్యరీతి 283

అందచందమున్న సుందరదేహంబు
పైనబాగకాన బడునుకాన
లోపలున్నమురికి లోనతలంచుము
రాయరేవచించు రమ్యరీతి 284

చూడచక్కనైన సుందరాంగునిచూచి
ఆశపడకుయోష? మోసపోకు
అతనిగుణగణంబు నాంతర్యమెరుగుము
రాయరేవచించు రమ్యరీతి 285

ప్రేమనేడుప్రియుడు ప్రియురాలుపడునట్టి
కామమునకు పేరుగలిగెకాని
సర్వభూతదయయు సమభావమేప్రేమ
రాయరేవచించు రమ్యరీతి 286

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

దేవతీర్థమంత్ర దివ్యౌషధంబుల
ఎట్టిభావమున్న నట్టిఫలమె
నమ్మకంబులేక నవిసిద్ధిపొందవు
రాయరేవచించు రమ్యరీతి 287

మోక్షమాకసమున మున్నీటభూమిలో
నాకమందు నాగలోకమందు
ఎందులేదు మనసునందుననుండును
రాయరేవచించు రమ్యరీతి 288

అత్తలేనికోడలు ఉత్తమురాలౌను
కోడ్లులేని అత్తగుణముగలది
పెత్తనంబుకొఱకె అత్తకోడలుపోరు
రాయరేవచించు రమ్యరీతి 289

అరగిపోవురాయి అవిరియౌనీరు
ఇరిగిపోవుకఱ్ఱ తరుగునినుము
ఆశపెరుగుగాని నాశనమేకాదు
రాయరేవచించు రమ్యరీతి 290

ఎద్దుయీనెనన్న నేమిదూడనువాడు
పాలుపితుకుమంచు పలుకువాడు
రాజకీయమందు రాణించుచున్నాడు
రాయరేవచించు రమ్యరీతి 291

నిన్ననున్నవాడు నేడులేడుగదన్న
రేపులేనివాడు మాపుపుట్టు
బాటసారినీవు పయనంబు నెరుగుము
రాయరేవచించు రమ్యరీతి 292

పిచ్చిపోవుదాక పెండ్లికానేకాదు
పెండ్లికాకపోతె పిచ్చిపోదు
అట్లునేడునీతి యవినీతిపెనబడు
రాయరేవబించు రమ్యరీతి 293

మన్నుదున్నుకున్న మనిషిమన్నిదౌన?
మిన్నుమిన్నుకున్న వెన్నువిరుగు
నీరులేనిచోట పైరుపండదుగదా?
రాయరేవబించు రమ్యరీతి 294

లంజలంచునేల లలనలతిట్టుట
బుద్ధిహీనులైన పురుషులుండ
వారిపొందుగోరువారు మూర్ఖులుగార?
రాయరేవబించు రమ్యరీతి 295

బ్రతకలేకవారు బ్రష్టులైపోయిన
వారకాంతవృత్తి వారలైన
కలలనేర్చుకొనుచు కలలపోషించిరి
రాయరేవబించు రమ్యరీతి 296

అలితోడపోరు అర్థంబువ్యర్థంబు
వల్లుగుల్లయౌను; ఉల్లమురియు
చింతవంతగల్గు చెడుదారిపట్టిన
రాయరేవబించు రమ్యరీతి 297

ఇంటిలోననున్న యిల్లాలితోడను
తృప్తిపడుచు నేతితీపితినక
పుల్లగూరకేల పొరుగింటికేగుట
రాయరేవబించు రమ్యరీతి 298

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావళి

ఆడవారికట్టి యలవాటులున్నచో
బరితెగించిపోయి భ్రష్టుపట్టి
మార్చుచుంద్రురోజు మగవారలనుఁగూడ
రాయరేవచించు రమ్యరీతి 299

మగనిమోసగించు మగనాలిమొగమును
భర్తకెదురుతిరుగు భార్యపలుకు
కనగవినగరాదు కష్టనిష్ఠురమగు
రాయరేవచించు రమ్యరీతి 300

గురువుబ్రహ్మవిష్ణు పరమేశ్వరుండును
తల్లిదండ్రిమరియు దైవమగును
బ్రతుకుతెరవుచూపు బ్రహ్మైక్యమునుచెప్పు
రాయరేవచించు రమ్యరీతి 301

మావినుండివచ్చి మాయలోపడకుండ
జ్ఞానబోధచేసి జనులకెల్ల
ముక్తికలిగజేయు మూర్తియేగురువన్న
రాయరేవచించు రమ్యరీతి 002

లాలనంబుచేయ బాలబాలికలకు
కీడుజరుగుఁగాని తాడనంబు
మేలుచేయుపుత్ర మిత్రులకైనను
రాయరేవచించు రమ్యరీతి 303

శిక్షయొసగురక్ష శిశువులకెల్లను
దేవునకునునైన దెబ్బెగురువు
శిక్షమానకండి రక్షింపదలచిన
రాయరేవచించు రమ్యరీతి 304

చదువుకొన్నవాడు సద్గుణవంతుడు
భర్తదొరికినపుడు భార్యకూడ
చదువుకొన్నయెడల సంస్కారవతియౌను
రాయరేవచించు రమ్యరీతి 305

చదువురానిభార్య చదువనిబిడ్డలు
బావిలేనిభూమి పారనేరు
నీరులేనిఊరు నిరుపయోగముగాదె
రాయరేవచించు రమ్యరీతి 306

కట్నమెక్కువంచు కఠినాత్మురాలిని
చేసికొన్నమీకు చేటుకలుగు
జాలిచూపునాలి నోలిచ్చికొనవచ్చు
రాయరేవచించు రమ్యరీతి 307

తినెడుతిండిబట్టి మనుజుండుమారును
క్రూరమైనతిండి క్రూరుజేయు
సత్వగుణముగల్గు సాత్వికాహారన
రాయరేవచించు రమ్యరీతి 308

వైద్యులెల్ల వైద్యవిద్దెలుచదివిన
తిండిలోనిగుణము తెలిసికొనరు
బ్రహ్మచర్యఫలము బాగుగానెరుగరు
రాయరేవచించు రమ్యరీతి 309

ఉప్పుపులుసుతీపి ఉపకారమొనరించు
అధికమైననవి యొహానిచేయు
చేదువగరుతిన్నరాదు రోగముకూడ
రాయరేవచించు రమ్యరీతి 310

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

కారమధికమైన కడుపులోపుండౌను
ఉప్పుతిన్న గుండెనొప్పికల్గు
తీపిమితముమీర తీపిరోగమువచ్చు
రాయరేవచించు రమ్యరీతి 311

ఆకుకూరలైన నప్పుడప్పుడువాడు
పైత్యమధికమున్న పనికిరావు
పాలువెన్ననేయి పరిమితంబుగవాడు
రాయరేవచించు రమ్యరీతి 312

ఆకుకూరలైన నధికంబుగాతిన్న
పైత్యమెక్కువగును పసరువలన
రక్తమందు పైత్యరసముచేరినచేటు
రాయరేవచించు రమ్యరీతి 313

ఆడవారినటులె అర్థాన్నిచూచిన
బ్రహ్మకైనపుట్టు బిమ్మతెగులు
మనుజుడెంత బుద్ధిమంతుడైననుమారు
రాయరేవచించు రమ్యరీతి 314

ఉల్లిమల్లికాదు ఉడుతగాదుఉడుము
ఉప్పుకారమవదు కప్పపాము
బీజమెట్టిదైన భూజంబునట్టిదౌ
రాయరేవచించు రమ్యరీతి 315

మనుజుడెంతయత్న మాచరించినగాని
దైవనిర్ణయంబు తప్పదన్న
ఈసుపైనభారమేసి చేసినచాలు
రాయరేవచించు రమ్యరీతి 316

కలికులేనినరుడు మరుకుగానుండడు
మొండియెద్దుబోలె నుండుగాదె
కీరుకులేనిపుల్ల బరికినామండునా
రాయరేవవించు రమ్యరీతి 317

బుస్సుకస్సుమనని భుజగంబునైనను
బాలుడైనపట్టి బాధపెట్టు
కరచునట్టికుక్క కడకెవ్వరునుపోరు
రాయరేవవించు రమ్యరీతి 318

ఆయుధంబులేక నడవికేగగరాదు
కఱ్ఱలేకపోవ గొఱ్ఱెకఱచు
ఆయుధంబుధైర్య మతివకైననుతెచ్చు
రాయరేవవించు రమ్యరీతి 319

కామమెక్కువగచు కన్నెగాననివాడు
సిగ్గుభయమువీడి యెగ్గుమరచి
కోర్కెతీర్చమంచు కోరినకీడౌను
రాయరేవవించు రమ్యరీతి 320

నిగ్రహంబులేని విగ్రహంబెందును
ప్రగ్రహంబులేని పశువుబోలె
స్వేచ్ఛగలిగియున్న చెప్పుదెబ్బలుతిను
రాయరేవవించు రమ్యరీతి 321

ఎవనికర్మవాడు ఏనాటికైనను
అనుభవించితీరు నవనిలోన
పాడుపనులుచేసి చెడిపోవతగదన్న
రాయరేవవించు రమ్యరీతి 322

## ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

స్త్రీలుయెందుకింత బేలలై పోయిరి
పురుషుజూచి భయముపొందనేల
చెరచవచ్చినపుడు చీల్చిచెండాడరు
రాయరేవచించు రమ్యరీతి 323

బలముతక్కువంచు భయపడుచుందురు
పిరికితనముతోడ నురుకుచుంద్రు
రుద్రమాంబబోలె రౌద్రంబుజూపరు
రాయరేవచించు రమ్యరీతి 324

ఝాంసిలక్ష్మిబాయి హంసియహల్యయు
మల్లమాంబ నాగమాంబలగుచు
మీదికొచ్చువానిమోది పాధేయరు
రాయరేవచించు రమ్యరీతి 325

దొరికినట్టిదానితోడ ఢీకొనిపోరి
ప్రాణమాన భంగమునకుపూను
పురుషగాయపరచి పేరుపొందగలేరు
రాయరేవచించు రమ్యరీతి 326

మంచిస్నేహితుండు మర్మంబులనుదాచి
సుగుణములనె చాటుచుండునెపుడు
దుర్గుణంబులున్న తొలగింపగాజూచు
రాయరేవచించు రమ్యరీతి 327

స్నేహితంబుకంటె శ్రేష్టమైనదిలేదు
స్నేహితుండు మేలుచేయుచుండు
స్నేహితంబులేని జీవితంబేటికి
రాయరేవచించు రమ్యరీతి 328

ఆప్తమిత్రుడైన నపకీర్తితొలగించు
కీర్తికలుగజేయు నార్తిబాపు
మిత్రుడెవరికైన శత్రువుగాబోడు
రాయరేవబించు రమ్యరీతి. 329

ఉన్నవేలకాని లేనివేళైనను
సుఖమునందుగాక దుఃఖమందు
వీడనట్టివాడెచూడ సన్మిత్రుడు
రాయరేవబించు రమ్యరీతి 330

ఆకలైనవాని కన్నంబుపెట్టక
పల్లెమేయునేల రాల్లకెల్ల
అథితికపుడులోన నగ్నిదేవుడులేడ
రాయరేవబించు రమ్యరీతి 331

సాధుజనులనెల్ల సంరక్షణముచేయ
దుష్టనరులనెల్ల దునిమివేయ
జగతిలోనప్రభువు జన్మించుపలుమారు
రాయరేవబించు రమ్యరీతి 332

ఆత్మలోననెట్టి ఆకారమునునిల్పి
కొల్చుకొంటమనేది తల్చుకున్న
అట్టిరూపుదేవుడతని కోర్కెనుతీర్చు
రాయరేవబించు రమ్యరీతి 333



# ఎల్లారెడ్డి రచనలు:

ప్రస్తుతము ముద్రించిన గ్రంథములు :

1) అభినవాంధ్ర భిల్లాణీయము
2) ఎల్లారెడ్డి గాయాలు
3) ఎల్లారెడ్డి సూక్తిముక్తావలి

అముద్రితములు :

1) ఎల్లారెడ్డి భావాలు (నాటికలు)
    1) పురోగతి
    2) తప్పెవరిది
2) కలువు (నాటకం)
3) ఎల్లారెడ్డి గేయాలు
4) ఆంధ్రప్రదేశావతరణము (బుఱ్ఱకథ)
5) ఆధునికాంధ్ర మేఘదూతము గేయానువాదము